# మాధవవర్మ

(నాటకం)



డా॥ అందె వేంకటరాజము
ఎం. ఏ., పిహెచ్. డి.

రిటైర్డ్ ఆంధ్రోపన్యాసకుడు

కోరుట్ల

MADHAVA VARMA : DRAMA
By
DR. ANDE VENKATA RAJAM, M. A, Ph. D.
Retired Telugu Lecturer
KORATLA-505 326, Dist. Karimnagar, A. P.

---

**మాధవవర్మ - నాటకం**

**డా॥ అందె వేంకటరాజము** ఎం.ఏ., పిహెచ్. డి.

రిటైర్డ్ తెలుగు లెక్చరరు

ప్రథమ ముద్రణ : వేయి ప్రతులు.

నవంబరు 1993



ప్రచురణ :

**మహేశ్వరీ గ్రంథ మండలి, కోరుట్ల**

ఐదవ కుసుమం

**వెల : రూ॥ 15/-**

ముఖచిత్రాలంకరణ : శ్రీ అలిశెట్టి మహారాజు

ముఖచిత్ర ముద్రణ :

**బాలాజీ ఆర్ట్ ప్రింటర్స్,**

చిక్కడపల్లి, హైదరాబాద్-500 020

ముద్రణ :

**మాధవీ ప్రింటర్స్**

3-3-869, కుత్బిగూడ,

హైదరాబాద్-500 027

ప్రతులకు :

**డా॥ అందె వేంకటరాజము**

**మహేశ్వరీ గ్రంథ మండలి**

2-3-18, మార్కండేయ మందిరం వద్ద

కోరుట్ల-505 326

జిల్లా : కరీంనగర్, ఆం. ప్ర.

డా॥ తిరుమల శ్రీనివాసాచార్యులు, ఎం. ఏ., పిహెచ్. డి.
ఆంధ్ర శాఖాధ్యక్షులు, సర్దార్‌పటేల్ కాలేజి, సికింద్రాబాదు

# "నాటకానికి ముందు నాలుగు మాటలు"

డా॥ అందె వేంకటరాజం గారు అమృత హృదయులూ, ఆప్తమిత్రులూ. వారు కవి శిరోమణులుగా మధుర మంజుల నవోదయాలను వర్షించారు. కావ్య మణి మంజూషలను అందించి, సహృదయ పాఠకులను కవితా శ్రీమంతులను చేశారు. నాటక కర్తలుగా భారతరాణి, ధనవిజయము నాటికలను రచించి "నాటకాంతంహి సాహిత్యమ్" అనే సూక్తిని సార్థకం చేసి, తమ రచనా వ్యక్తిత్వాన్నీ, వైదుష్యాన్నీ పండించుకున్నారు. ప్రామాణిక పరిశోధకులుగా అభినవ పోతన శ్రీమాన్ వానమామలై వరదాచార్యుల వారి కృతులను ప్రతిభాచక్షువులతో పరిశీలించి, వారి కవితాత్మను హృదయంగమంగా ఆవిష్కరించి, సహృదయ లోకానికి వరదాచార్యుల కావ్యామృతాన్ని పంచి పెట్టారు. అవధాన యువ కేసరులై అనేక పండిత పరిషత్తులలో తమ సద్యస్ఫూర్తినీ అసాధారణ ధారా ధారణలనూ ప్రదర్శించి, హృద్యకవితా ప్రఫుల్లమంజరీ మరంద మాధురినీ పాండితీ పరిమళాలనూ అందించారు. ఇక ప్రస్తుతం సహృదయ విమర్శకులుగా వారు తమ సాహితీ జీవన తరంగాలను మన అంతరంగాలలో నింపుతున్నారు. తమ "మానసవీణ"ను మీటి ఈశ్వర శతకము, కళాతపస్విని వంటి సంపుటులను సృష్టించి కమనీయకవితా ముగ్ధమోహన రాగాలతో మనలను ఆనందింపజేస్తున్నారు.

డా॥ వేంకటరాజం గారు సాహితీసృష్టికర్తలే కాదు - విశేష సాహిత్య ప్రచారకులుగూడా. వారు భారతీ సాహిత్య సమితి అధ్యక్షులై కరీంనగర మండలంలో అనేక సమావేశాలను నిర్వహించి, తెలుగు భారతీ అందాల అందెల రవళులను వినిపించి రసజ్ఞ లోకాన్ని పులకింపజేశారు. మహేశ్వరీ గ్రంథమండలి వ్యవస్థాపకులై తెలుగుభాష తీరుతెన్నులనూ, తియ్యందనాలనూ అందించి సరసుల ఉల్లాలను ఊరించారు. గృహవాస్తు పండితులై పౌరజీవన సౌఖ్యలబ్ధికై బహుధా సహకరిస్తున్నారు.

శ్రీ వేంకటరాజం గారు ఆదర్శాధ్యాపకులు. తమ విస్తృతమైన పరిజ్ఞానంతో అసంఖ్యాకశిష్యులను తీర్చిదిద్దారు. వారు తమ శరీరాన్ని ధర్మ సాధనంగా చేసికొని జీవిస్తున్న వినిర్మల జీవనులు. విశుద్ధచిత్తులు. సౌమ్య స్వభావులు. ప్రజోపకారపరాయణులు. ఇలా సాహితీస్రష్టలుగా, సాహిత్యప్రచారకులుగా, సౌశీల్యమూర్తులుగా శ్రీ వేంకటరాజంగారి సేవాజీవనం త్రిముఖంగా విస్తరించి, విశ్వకళ్యాణానికి విరులబాట వేస్తున్నది.

"మాధవవర్మ" నాలుగు రంగాలుగా నడిచిన ఒక చారిత్రక నాటకం. "నాటకం" - అనే మాట శాస్త్రీయంగా గాక సాధారణంగా ఆధునిక దృక్పథంతో వాడిన మాట అని గ్రహించాలి ఈ సందర్భంలో.

ఒక పేద యువకుని మరణానికి తన కొడుకు కారకుడైనాడని నిర్ధయించి, ధర్మబుద్ధి అయిన మాధవవర్మ మహారాజు, ఆతనికి ఉరిశిక్షను విధించడం, ఆ ప్రభువు ధర్మదృష్టికి మెచ్చి దుర్గాదేవి కనకవర్షం కురిపించి, మరణించిన యువరాజునూ పేద యువకుణ్నీ పునర్జీవితులను చేయడం ఈ నాటకంలోని ఇతివృత్తం. ఈ ఇతివృత్తాన్ని ఎంతో నేర్పుతో నాలుగు రంగాలుగా వింగడించి ఉత్సుకత ఊరేలాగా కథను నడిపించారు శ్రీవేంకటరాజంగారు.

మాధవవర్మ విష్ణుకుండి వంశ మహారాజు. ఆతడు విజయవాటికాపురం రాజధానిగా కృష్ణాగౌతమీనదుల నడుమనున్న ఆంధ్రదేశాన్ని పరిపాలిస్తుంటాడు. ఆతడు శ్రీ దుర్గామల్లేశ్వరస్వామి మహాభక్తుడు. పరమ వైదిక నిర్మల ధర్మనిష్ఠాపరతంత్రుడు. నవాశ్వమేధయాగ నిర్వాహకుడు. ఆత్మస్తుతిపరాఙ్ముఖుడు. ఆతనిది ఎప్పుడూ ధర్మపక్షమే. ఆశ్రితులకు ఆతడు ఎల్లవేళలా కల్పవృక్షమే. ఆంధ్రదేశానికి ఈశాన్య దిశలో కళింగగాంగులు కంటకాలవలె నిలిచి, దురాక్రమణలు చేసినప్పుడెల్ల, విక్రమించి, వారిని తరిమికొడుతూ సరిహద్దులను రక్షించుకునే పరాక్రమశాలి. ఆతడు సకల విద్యలనూ శాస్త్రకళలనూ పోషిస్తూ ప్రజారంజకంగా పాలిస్తుంటాడు. తన సర్వసత్సంకల్పసిద్ధికి కారణం శ్రీ దుర్గామల్లేశ్వరస్వామియే అని అతని నమ్మకం. ఆతని భార్య చంద్రావతీదేవి. ఆమె మహాకోసల రాజపుత్రి. ఆ దంపతుల ఏకైక పుత్రుడు మంచన భట్టారకుడు. దుర్గామల్లేశ్వర స్వామి ప్రసాదసంజనితుడు. యౌవరాజ్య పట్టాభిషిక్తుడు. గుణ్ణపు

స్వారి పందేలలో ప్రథముడుగా నిలిచినవాడు. కళింగగాంగులతో జరిగిన యుద్ధాలలో తన ప్రతాపాన్ని ప్రదర్శించినవాడు. యువరాజు వినయవంతుడే, కానీ మితిమీరిన తనకుమారుని ఉత్సాహసాహసాలు చూసి ఒకవైపు ఆనందిస్తూనే మరోవైపు అవి ఏమి ప్రమాదం తెచ్చి పెడతాయో అని బాధపడేవాడు మాధవ వర్మ. ఒకనాడు అతడు కొలువుతీర్చి దేశవ్యవహారాలను సమీక్షిస్తుండగా, ఒక అరేబియా వర్తకుడు గుఱ్ఱాల వ్యాపారంచేస్తూ, రాజును దర్శించి, తన వద్ద మంచి ఫౌజీ గుఱ్ఱాలూ, సవారీ గుఱ్ఱాలూ ఉన్నాయనీ, జతకు పదివేల దీనారాలనీ చెపుతాడు. మంచి సవారీగుఱ్ఱాలు తనరథానికి వాహనాలుగా కావాలని యువరాజు కోరుతాడు. స్వారీ గుఱ్ఱాలు అవసరమనే అంశాన్ని మహామంత్రి కూడా నొక్కి-చెప్పేసరికి, మాధవవర్మ తస కొడుకు కోరికను కాదనలేక ఒక జత గుఱ్ఱాలను కొనివేస్తాడు.

ఒకనాడు మాధవవర్మ అంతఃపురంలో భార్యతో సరసంగా సంభాషిస్తూ తన కుమారుని వివాహాన్ని గూర్చి ఆలోచిస్తుండగా, ఆతనికి మొగసాల నుంచి ధర్మఘంటానాదం వినిపిస్తుంది. ఆ వెంటనే ఒక పేద ముదుసలిది పుల్లమ్మ అనే ఆమె తస కొడుకు శవాన్ని మోసుకొని ఏడుస్తూ ప్రవేశిస్తుంది. తన కొడుకు వీధిలో చింతకాయలు అమ్ముకుంటుంటే ఏదో రాచవారి రథం వేగంగా వచ్చి తన కొడుకుపై నుంచి పోయి ప్రాణాలు తీసిందనీ, ధర్మప్రభువులు న్యాయం చెయ్యాలనీ వలవల ఏడుస్తుంది. ధర్మమూర్తి అయిన మాధవవర్మ అందుకు దుఃఖించి, యువకుని మరణానికి కారకుడైన దుర్మార్గుణ్ని కఠినంగా శిక్షిస్తానని మాట ఇచ్చి ఆమెను ఊరడించి, ఆ ముసలవ్వకు తగిన ఉపచారాలు చేయవలసిందిగా ఆజ్ఞాపించి, వెంటనే రక్షకభటాధికారిని ప్రవేశపెట్టవలసిందని ఆజ్ఞాపిస్తాడు.

మరునాడు మాధవవర్మ ధర్మాసనాసీనుడై, జరిగిన దుస్సంఘటన మర ణించిన యువకుని అజాగ్రత్త వల్లనే జరిగినట్లు తెలియవచ్చిందని విన్నవించిన ప్రాడ్వివాకుని అభియోగం వింటాడు. తన కొడుకు మరణానికి రథచోదకుడే కారణమని చెప్పిన వాదియైన పుల్లమ్మ వాఙ్మూలం వింటాడు. జనసమ్మర్దంలో రథవేగంలో దుస్సంఘటన జరిగిన విషయం రక్షకభటాధికారి చెప్పేదాక తనకే మాత్రం తెలియదనీ, తెలియకుండ సంభవించిన ఆ ఘోరప్రమాదానికి చాలా

చింతిస్తున్నానసీ, ధర్మాధికారులు విచారించి న్యాయం చేయవలసిందనీ అర్థించిన నిందితుడు యువరాజు మాటలనూ వింటాడు. యువరాజే నిందితుడని చెప్పడానికి ప్రత్యక్షసాక్ష్యాధారాలేమీ లేవనీ, కావున యువరాజు నిర్దోషి అని అంటూ తుది నిర్ణయం చేసి తీర్పు వెలపియవలసిందనీ విన్నవించిన ధర్మాధికారి పలుకులనువింటాడు. అంతాపిని మాధవర్మ మహారాజు జనసమ్మర్దంగల నగరవీధులలో రథమెక్కి స్వారిచేయడం ఒక దోషమనీ, మరో యువకుని నిండు ప్రాణాలను బలిగొనడం మహాపరాధమనీ కావున నిందితుడు దోషి అని నిర్ణయించి, శిక్షాస్మృతి ప్రకారం హంతకుడైన దోషికి మరణశిక్షను విధిస్తాడు. యువరాజు మంచన భట్టారకుని సూర్యుడు అస్తమించేలోగా ఉరి తీయవలసిందిగా ప్రకటిస్తాడు.

కొలువు కూటంలో రాజుగా ధర్మాన్ని నిర్వర్తించిన మాధవవర్మ, ఒక తండ్రిగా అంతఃపురంలో దుఃఖభారంతో వివశుడైపోతాడు. చంద్రావతీదేవి తన కొడుకును రక్షించవలసిందిగా దుర్గాదేవిని ప్రార్థిస్తుంది. యువరాజును ఉరి తీశారన్న వార్తను విని ఆ రాజదంపతులు కన్నీరు మున్నీరుగా విలపిస్తారు. ప్రజల హాహాకారాలు ప్రతిధ్వనిస్తాయి. ఆ క్షణంలో కనకవర్షం కురుస్తుంది. మహారాజు ఆశ్చర్యపడి, అది దుర్గాదేవి అనుగ్రహమని భావిస్తాడు. అంతలోనే యువరాజు పునర్జీవితుడైనాడన్న భటుని వార్తను విని సంతోషిస్తాడు. అయినా పేద యువకుని దుర్మరణాన్ని తలచి అతడు దుఃఖిస్తాడు. పరమేశ్వరిని ప్రార్థిస్తాడు. ఆ క్షణంలో మరణించిన పేద యువకుడు బ్రతికాడన్న భటుని వార్తను విని ఆనందిస్తాడు. మరుక్షణంలో మంచన భట్టారకుడు వచ్చి తల్లిదండ్రులకు నమస్కరిస్తాడు. ఇకనైనా జాగరూకతతో ఆత్మ నిగ్రహంతో జీవితం సాగించి ధర్మబద్ధంగా రాజ్యం పాలించి, యశస్విని కమ్మని ఆశీర్వదిస్తాడు మాధవవర్మ. కనకాన్ని కురిపించిన దుర్గాదేవి కనకదుర్గ అనీ, 'సర్వే జనాస్సుఖినోభవంతు' అన్న పురోహితుని మంగళ వాక్యాలతో ఈ నాటకం ముగుస్తుంది.

ఈ నాటకంలోని ప్రధానాంశం మాధవవర్మ ఒక ధర్మమూర్తిగా, కన్న కొడుకని భావించక యువరాజుకు మరణశిక్ష విధించడం. యువరాజు మరణ

శిక్షకు కారణం - అతని మితిమీరిన యౌవనోత్సాహాలూ, వాటికి తోడుగా - అతివేగంగా పయనించే అతని మదించిన అశ్వాలూ - ఈ రెంటికీ అదుపు లేక పోవడం. మొదటి రంగంలోని - "యౌవనం మదించిన గుఱ్ఱం వంటిది. దానికి గట్టిగా కళ్లెం వేయవలెను. లేకుంటే ప్రమాదానికి దారితీసే అవకాశం ఉన్నది" అనే మాధవవర్మ మాటలు ఎంతో బాగున్నాయి. భావికథా స్ఫోరకాలుగా ఉన్నాయి. "యౌవనం మదించిన గుఱ్ఱం వంటిది" - అన్న ఒక్క వాక్యం ద్వారా యౌవనంలో ఉన్న యువరాజూ - అతని ప్రమాదానికి కారణమైన గుఱ్ఱాలూ స్ఫురించడం గమనార్హం. ఈ ఒక్క వాక్యమే నాలుగు రంగాల కథకు ప్రణాళికను రూపొందించినట్లుంది. మాధవవర్మ యువరాజు కోరిక మేరకు అరేబియా గుఱ్ఱాలను కొనడం ప్రథమ రంగంలోని ప్రధానాంశం. ఆ గుఱ్ఱాలను పూన్చిన రథంపై యువరాజు స్వారి చేస్తూ రాజవీధిలో పేద యువకునిపై నుండి రథాన్ని నడపడం, యువకుడు మరణించడం - రెండవ రంగం. పేద యువకుని మరణం కారణంగా మహారాజు ధర్మమూర్తిగా యువరాజుకు మరణశిక్ష విధించడం - మూడవ రంగం. మాధవవర్మ ధర్మ దృష్టికి మెచ్చి దుర్గాదేవి కనకవర్షం కురిపించి, యువరాజునూ పేద యువకుణ్ణీ బ్రతికించడం - నాల్గవ రంగం. ఇలా కథా విభజనం ఆయా రంగాలలో చక్కగా జరిగింది.

ఈ - "మాధవవర్మ" నాటకంలో అంగిరసం ధర్మవీరం. శృంగార హాస్య కరుణాద్భుతాలు అంగరసాలు. మాధవవర్మ దోషి అయిన తన కుమారునికి ఉరిశిక్ష విధించడం వలన ధర్మవీరం పతాకస్థాయినందుకున్నది.

"సమర్థులూ దేశ ధర్మ భక్తి పరాయణులైన మీరందరూ సహకరిస్తుండగా ఏ ఘనకార్యం నెరవేరదు" - (మొదటి రంగం)

"మాకు మా కుమారుడెంతో నీ కుమారుడు అంతే .... కర్తవ్యం నెరవేరుస్తాను" - (రెండవ రంగం)

"ధర్మానికి తన వారు పరాయివారన్న భేదం లేదు"

"ధర్మాన్ని కాపాడితే అది మనను కాపాడుతుంది" - (మూడవ రంగం)

"బ్రహ్మాదులు వచ్చి చెప్పినా రాజధర్మాన్ని త్యజించను"

"నాకు తోచిన రీతిగా ధర్మాన్ని కాపాడినాను. దుర్గాదేవి అనుగ్రహిస్తున్నది"

"ఇంతకు ఆ పేద యువకుడు దుర్మరణంపాలై యుండగా మన కుమారుడు మాత్రం పునర్జీవితుడైనాడు. ఇది అన్యాయమని నా హృదయం తల్లడిల్లుతున్నది. ఆ పరమేశ్వరియే అనుగ్రహించవలెను"

"ఇకనైనా జాగరూకతతో, ఆత్మనిగ్రహంతో జీవితం సాగించి, ధర్మబద్ధంగా రాజ్యపాలన చేసి, యశస్వివి కావలెను" - (నాల్గవ రంగం)

ఇలా ఆయా రంగాలలో కథానాయకుడైన మాధవవర్మ పల్కిన పలుకులు ఆతని ధర్మవీరాన్ని చాటుతున్నాయి.

రెండవ రంగంలో - అలంకృత అయిన చంద్రాదేవి - మాధవవర్మల సరస సంభాషణలో శృంగార హాస్యరసరేఖలు తళుక్కుమంటున్నాయి. నర్తకి నృత్యగీతికాభినయ ఘట్టంలో భక్తిరసం తరంగితమయింది. పేద ముసలమ్మ పుల్లమ్మ తన కొడుకు శవాన్ని మోసుకొనివచ్చి, రాజసన్నిధిలో నిలిచి విలపించిన ఘట్టంలోనూ, మాధవవర్మ ఒక తండ్రిగా విలపించిన సందర్భంలోనూ, చంద్రవతీదేవి మూర్ఛిల్లిన సమయంలోనూ కరుణరసం చక్కగా పోషింపబడింది. దుర్గాదేవి అనుగ్రహంతో కనకవర్షం కురువడం, రాజకుమారుడూ పేదయువకుడూ పునర్జీవితులైన సందర్భంలో అద్భుతరసం చోటుచేసుకున్నది. ఇలా ఈ నాటకంలో అంగి-అంగరసాలను చక్కగా పోషించి రససిద్ధులైనారు శ్రీ వేంకటరాజంగారు.

కథానాయకుడైన మాధవవర్మ పాత్రను ప్రజారంజకుడైన పాలకుడుగా వైదిక ధర్మపరతంత్రుడుగా, ధర్మోద్ధారకుడైన న్యాయమూర్తిగా వాత్సల్యాపూర్ణుడైన కన్న తండ్రిగా శ్రీ దుర్గా మల్లేశ్వరస్వామి మహాభక్తుడుగా మహోదాత్తంగా చిత్రించారు శ్రీ వేంకటరాజంగారు. అనుకూలవతియైన మాతృమూర్తిగా, భార్యగా మహాభక్తురాలిగా చంద్రావతీదేవి పాత్ర సహృదయుల మన్ననలను అందుకుంటుంది. పొంగిపొరలే యౌవనోత్సాహాలకు ప్రతినిధిగా, పరాక్రమానికి ప్రతీకగా, సత్యాన్ని అంగీకరించే ఒకనిర్మల చిత్తునిగా, ధర్మానికి తలవంచే ఒకసత్పౌరునిగా

వినయ పాఠాలను నేర్చుకోవాలనే సంకల్పముస్న రాజపుత్రునిగా, దేవీ భక్తునిగా సహృదయుల సానుభూతికి పాత్రమౌతుంది యువరాజు మంచనభట్టారకుని పాత్ర. అలాగే మహామంత్రి, పురోహిత ధర్మాధికారి పాత్రలూ, అరేబియా వర్తకుని పాత్ర, పుల్లమ్మ పాత్ర సముచితంగా పోషింపబడినాయి.

ఈ నాటకంలోని సంభాషణలు పాత్రోచిత మర్యాదలతో సాగినాయి. కొన్ని ఘట్టాలలో సంభాషణలు దీర్ఘములైనా - అవి రససిద్ధికే దోహదం చేశాయి. ఈ రూపకంలోని రెండు పాటలూ భక్తి కరుణ రస పరిపోషకాలై సహృదయులకు రసాస్వాదన సౌలభ్యాన్ని కలిగిస్తూ శ్రీ వేంకట రాజం గారి ఆధునిక దృక్పథాన్ని వ్యక్తం చేస్తున్నాయి.

వ్యావహారిక ధోరణిలో పాత్రోచితంగా సరళంగా సాగింది ఈ నాటకం లోని భాష. వందిమాగధుల కైవారాలు సంస్కృత సమాస బంధురంగా అంత్యా ప్రాస సుందరంగా భాసిస్తూ, మాధవవర్మ మహారాజ వైభవాన్ని మహోజ్జ్వలంగా ప్రకటిస్తున్నాయి.

అరేబియా వర్తకుని సంభాషణలోని భాష ఉర్దూపదప్రచురంగా రుచిరంగా సాగి పాత్రౌచితికి పదును పెట్టింది. ఆ వర్తకుని నోటబడిన అజంత భాష హలంత భాషగా మారి పాఠకులను నవ్విస్తుంది.

పుల్లమ్మ పుక్కిలించిన జానపద భాష ఆ స హ జ మై న యాస పాత్రోద్దీప్తికి వన్నెలు దిద్దింది.

ఆయా పాత్రలనోట విభిన్న సందర్భాలలో కవితాత్మక వాక్యాలనూ, సామెతలనూ, విశ్వజనీన సత్యాలనూ, సూక్తులనూ పలికించి నాటకాన్ని రసోన్ముఖంగా నడిపించారు డా॥ వేంకటరాజం గారు.

ఈ నాటక వస్తువు ఆరవ శతాబ్దినాటిది అయినా ఈనాటి మన దేశ సమస్యలను ఇందులో ప్రతిఫలింపజేశారు సహజరమ్యంగా రచయిత.

ఉదాహరణకు - దేశ సరిహద్దు సమస్య. దేశ భద్రతాదృష్టి, భారత విదేశాంగనీతి, విద్యారంగంలో అధ్యాపకుల కొరత, సంస్కృతభాషా

ప్రాధాన్యం, యాత్రాస్థలాల సౌందర్య సౌకర్య ప్రాముఖ్యం. దేశ సంక్షేమ ప్రయత్నాలలో రామరాజ్య స్ఫురణం మున్నగునవి. సమకాలిక దేశ సమాజ చిత్రణం ఒక మహాకవి నిర్మాణ శిల్పంలోని ఒక సూక్ష్మాంశం. అది సహృదయ విమర్శక హృదయైక వేద్యం.

భారతీయ రూపక మర్యాదానుకూలంగా అద్భుత రస నిర్వహణతో నాటకాన్ని మంగళాంతం చేసి, "ధర్మోరక్షతి రక్షితః" అనే సందేశాన్ని ఈ నాటకం ద్వారా చాటి చెప్పారు నాటకకర్త. నానాటికీధర్మదృష్టి దిగజారిపోతున్న ఈనాటి తరానికి ఈ నాటకం ఒకప్రబోధంగా పనిచేస్తుందనడం అత్యుక్తి కాదు. అందుకు శ్రీ అందె వేంకటరాజం గారు అభినంద్యులు.

ప్రయోగదృష్టితో ఈ నాటకాన్ని రచించిన డా॥ వేంకటరాజం గారు సహృదయ రసజ్ఞుల ప్రశంసలను అందుకుంటారనే నా విశ్వాసం. నా విశ్వాసం నిజమైతే సంతోషం.

ధర్మవీర ప్రధానమైన ఇంతమంచి నాటకానికి పీఠికాప్రాయంగా నాలుగు మాటలు వ్రాయండని కోరిన శ్రీ అందె వేంకటరాజం గారి హార్దమైత్రీ ధర్మానికి ధన్యవాదాలు.

# రంగభూమిక

శ్రీ మద్గురువర్యులు డా॥ అందె వేంకటరాజముగారు నవోదయము, మణి మంజూష, భువనవిజయము, భారతరాణి, కళాతపస్విని, ఈశ్వరశతకము మొద లగు ఖండకావ్య శతక సంపుటులు, నాటికా సంపుటులు రచించి, ముద్రించి సాహితీ విపంచి తంత్రులు మీటి సాహిత్యపిపాసుల హృదయాలను అలరించారు. భారతీ సాహిత్య సమితి కోరుట్లలో స్థాపించి ఎన్నో కార్యక్రమాలు నిర్వహించి రాష్ట్రస్థాయిలో సమితికి గుర్తింపును సాధించి, యువకవులకు సాహితీ మర్మాలు నూరిపోసి చక్కని కవులుగా తీర్చిదిద్ది కోరుట్లను కవుల కవితాగాన మరంద గంగా తరంగాలతో తడిపారు. సమితిని సమర్ధవంతంగా నడిపారు. ఇలాంటి పుంభావ సరస్వతీ మూర్తులైన గురువుగారు 'మాధవవర్మ' అనే చరిత్రాత్మక మైన నాటకం రచించి, ముద్రించి ఈ నాటకమును సమీక్షించి అభిప్రాయం వ్రాయుమని నన్ను ఆదేశించి ముద్రణా ప్రతిని చేతికి అందించగానే నేనెంతో పులకించి నా యథాశక్తి సమీక్ష చేయగలనని ప్రతిని స్వీకరించాను.

మనకు స్వాతంత్ర్యోషస్సు ఉదయించకన్న పూర్వం మనం పారతంత్ర్య తమస్సులో మునిగివున్న వేళలో కవుల, రచయితల, కళాకారుల మేధస్సులు అంతగా వికసించలేదు. సాంప్రదాయిక పద్ధతిలోనే కలాలు నడిపించి కావ్యాలు నాటకాలు రచించారు మన కవులు, రచయితలు. కాని మన దేశ ప్రజానాసికా పుటాలకు స్వేచ్ఛాకుంద గంధాలందిన పిమ్మట కవుల రచయితల కలాలు, గళాలు క్రొత్త ఊపిరులు నింపు కొన్నాయి. సాంప్రదాయిక పద్ధతుల్ని చంపు కొన్నాయి. తెలుగు సాహిత్యంలో పాశ్చాత్యుల రచనా పద్ధతుల వెలుగులు నింపుకొని శరపరంపరలుగా గ్రంథాలు వెలుగులోకి వచ్చినాయి.

మన తెలుగు నాటక రంగాన్ని స్థూలంగా పరిశీలించినట్లైతే వచ్చిన మార్పులు, చేర్పులు మనకు ద్యోతకమవుతాయి. మన నాటక రచయితలు పద్యాలు పాటలతో కూడిన నాటకాలు పౌరాణిక, చారిత్రక-ఇతివృత్తాలను అరు దుగా సాంఘికాలను గ్రహించి పూర్వం వ్రాసేవారు. ఆ నాటకాలలో గద్య

కనిపించేదికాదు. తర్వాత నాటక రచయితలు నాంది, ప్రస్తావన, విష్కంభము మొదలగు సాంప్రదాయిక పద్ధతులకు స్వస్తి పలికి ఒక క్రొత్త ఒరవడితో నాటికలు, నాటకాలు రచించి సమాజానికి అందించారు.

డా॥ అందె వేంకటరాజంగారు నవీన పద్ధతులతో చారిత్రాత్మకమైన ఇతివృత్తం గల 'మాధవవర్మ' అనే నాలుగు రంగాల నాటకాన్ని రచించారు. ఈ నాటకమును ఆమూలాగ్రంగా పరిశీలించినట్లైతే ఈ నాటకంలోని పాత్రపోషణ, శిల్పం, రసపోషణ, సంభాషణ, కథాకథనం గురువులు అందెవారు చిత్రించుటలో అందెవేసినారని అనిపిస్తుంది. వారి హృదయం సామాజిక నవీన భావాలతో సిక్తమైననూ చారిత్రక విషయాలంటే మిక్కిలి మక్కువ. అందుకే అందెవారు మొదట 'భువనవిజయం' అనే చారిత్రక నాటికను రచించి పాఠశాలల్లో, కళాశాలల్లో ప్రదర్శించి ఎంతో మెప్పును పొందినారు. ప్రస్తుతం మాధవవర్మకూడ చారిత్రాత్మకమైన నాటకమైనా ప్రదర్శనాయోగ్యమైందని నాకున్న రంగస్థలానుభవంతో చెపుతున్నాను.

మాధవవర్మ క్రీ.శ. 350లో జీవించియున్నాడనియు ఇతడు పల్లవ రాజనియు కవి సమ్రాట్ విశ్వనాథ సత్యనారాయణగారు భావించి ఆంధ్రప్రశస్తి అనే ఖండకావ్యంలో మాధవవర్మ ధర్మస్వరూపం రచించినారు. స్థూలంగా విజ్ఞాన సర్వస్వాన్ని పరిశీలించినట్లైతే ఈ రాజు విష్ణుకుండి వంశానికి చెందినవాడని స్పష్టంగా తెలుస్తుంది. డా॥ అందె వేంకటరాజంగారు విజ్ఞానసర్వస్వంలోని పల్లవుల చరిత్రను, విష్ణుకుండినుల చరిత్రను ఆమూలాగ్రంగా చదివి మాధవవర్మ విష్ణుకుండి వంశానికి చెందిన రాజని నిర్ధారించుకొని నాటకాన్ని రచించినట్లు తెలుస్తుంది.

బెజవాడను రాజధానిగాచేసుకొని మాధవవర్మ ధర్మబద్ధంగా, న్యాయసమ్మతంగా, ప్రజానురంజకంగా, పుంభావ ధర్మదేవతామూర్తియై పరిపాలించినట్లు మల్లేశ్వరస్వామి ఆలయంలోని క్రీ.శ. పండ్రెండవ శతాబ్దంనాటి శాసనం ద్వారా ఈ గాథ తెలియవస్తుంది. ఆ శాసనంలో గాథ ఇలా ఉంది.

క్రీ.శ. 514లో విజయవాటికను మాధవవర్మ సమర్థవంతంగా ధర్మ మార్గనిరతుడై పరిపాలించే కాలంలో ఒకనాడు తన ఏకైక పుత్రుడు మంచన భట్టారకుడు పదించిన మచ్చికకాని శ్వేతాశ్వాలను రథానికి బంధించి రాజ మార్గాన మెరుపులా చూపరుల కనులకు దొరకకుండ రథాన్ని నడిపించగా చింతకాయలమ్ముకొనే ఒకయువకుడు రథం క్రిందపడి రక్తం ముద్దై ప్రాణాలు కోల్పోయినాడు. ఆ యువకుని వృద్ధమాత మాధవవర్మకు తన గోడు విని పించగా ప్రాడ్వివాకుల పలుకులు విని ధర్మం తప్పక తన ఏకైక పుత్రునికి ఉరి శిక్ష విధించాడు. మాధవవర్మ ధర్మనిరతికి మల్లేశ్వరస్వామి ప్రీతుడై స్వర్ణవృష్టి కురిపించి యువకున్ని, యువరాజును పునర్జీవింపజేసెను. ఈ కథ తెలుగు వాఙ్మయంలో కూడ కలదు. శ్రీ నాధుని మరదియైన శ్రీ దగ్గుపల్లి దుగ్గయ్య తన "నాచికేతోపాఖ్యానంలో" "చతురంగబలములు జయవాడ మర్గాంబ వరము సంపదసి........వసుధ నెగడిన మాధవవర్మ" అని అతనిని కీర్తించినాడు. ఎటు చూసినా మాధవవర్మ విష్ణుకుండి వంశానికి చెందినవాడని తెలుస్తుంది. ముఖ్య విషయమేమిటంటే గురువుగారు అందెవారు గ్రుడ్డిగా ఒక విషయాన్ని నమ్మి రచనకు పూనుకోరు. వారు ఎన్నుకునే అంశాన్ని, విషయాన్ని నిశితంగా పరి శీలించి, శోధించి సత్యాన్ని సాధిస్తారు. మాధవవర్మ పల్లవరాజు అని నమ్మి పద్యఖండికను రచించిన విశ్వనాధవారి భావాన్ని ఏకీభవించక పూర్తి విషయం తెలుసుకున్న తర్వాతనే రచనకు పూనుకొన్నారు. ఇది వారి నిశితపరిశీలనకు నిదర్శనం.

డా॥ అందెవారు రచించిన మాధవవర్మ నాటకంలోని విషయం రాజుల కాలం నాటిదైనా నేటి సమాజానికి, పాలకులకు కనువిప్పు కలిగించి ధర్మ బద్ధంగా మనుగడ సాగించాలనీ, ధర్మనిరతి కలవారై పరిపాలించాలనీ అధర్మ వర్తనులై పాలకులు దేశప్రజలను పీడించరాదనీ ధర్మదేవతముందు ధనవంతులు, నిరుపేదలు, మదోన్మత్తులు, గర్వచిత్తులు, నాయకులు, అధికారులు, రాష్ట్రపతి, ప్రధానమంత్రి మొదలగు వారంతా సమానమే అనీ వివక్షతో, కక్షతో, పక్షపాత వైఖరితో దేశపాలన చేయరాదనీ ప్రబోధం కనిపిస్తుందీ మణిపేటికయైన నాట కంలో. సమాజానికి చక్కని స్ఫూర్తికి, సామాజిక దృక్పథానికి ఈ నాటకం చైతన్యదీపిక. దీనిలో కథ కన్నా ముఖ్యం ధర్మమే దర్శనమిస్తుంది. అందరూ సన్మార్గంలో నడవండని ప్రబోధిస్తుంది.

ప్రతిభావంతులైన రచయితలు కథారంభంలోనే భావికథాంశాలను నిగూఢం చేసి, నిక్షిప్తంచేసి ధ్వని పూర్వకంగా కథను నడిపిస్తారు. ఈ మాధవవర్మ నాటకంలోని మొదటి రంగంలో యువరాజు యొక్క ఉద్ధతి, ఉడుకు నెత్తురు మత్తడిదూకే ఉత్సాహం, భావి కథలో జరుగబోయే విషాద విషయం ధ్వనిస్తుంది. "మొన్న జరిగిన క్రీడలలో గుర్రపుస్వారీ పందెంలో చిరంజీవి ఉరికించిన గుర్రం రెప్పపాటులో మాయమైంది. తక్కిన యువకు లందరు దాని ధూళిలో కలిసిపోయినారు" అని పురోహితుడు పలికిన పలుకులు "కుమారుల మహాశౌర్యానికి మేమెంతో సంతోషించినాము. అయినా చిరంజీవిలో తక్కిన వాటికంటే ఉత్సాహసాహసాలు మితిమీరి ఉన్నవనియే మా విచారం". "యౌవ్వనం మదించిన గుర్రం వంటిది. దానికి గట్టిగా కళ్లెం వేయవలెను. లేకుంటే ప్రమాదానికి దారి తీసే అవకాశముంది" - అని మాధవవర్మ పురోహితు నితో మాట్లాడిన మాటలు భావి కథను ధ్వనింపజేస్తున్నాయి. అరేబియా వర్త కుడు మదించిన శ్వేతాశ్వాలు రాజుకు అమ్మడానికి వచ్చినప్పుడే యువరాజు ఆ అశ్వాలను తీసుకొనుటకు ఉత్సుకత చూపించినప్పుడే ఆ సందర్భంలో "నాయనా! తీసుకోగానే సరికాదు మదించిన అశ్వాలను జాగ్రత్తగా ఉపయోగించవలె సుమా!" అని యువరాజుతో మాధవవర్మ అన్నప్పుడే ముందేంజరుగుతుందోనని ప్రేక్ష కులకు ఉత్కంఠను కలిగిస్తుంది. ఈ ఉత్కంఠ నుండి ప్రేక్షకులు తేరుకోక ముందే రెండవరంగం నేపథ్యంలో ధర్మఘంట మ్రోగుట, ఒక పేద ముసలిది తన కొడుకు శవాన్ని మోసుకొని వచ్చి రాజు పాదాల చెంత పడవేసి కన్నుల నుండి కావేరులు ప్రవహింప జేయుట ప్రేక్షకులను కరుణరసం దిక్కుకు లాక్కెళ్లుతుంది.

శాసన కథలో అరేబియా వర్తకుని పాత్ర లేకున్నా డా॥ అందెవారు ఆ వర్తకుని పాత్రను సృష్టించి, వచ్చిరాని తెలుగుపలుకులు ఆ పాత్రద్వారా పలికించి మొదటి రంగంలో హాస్యరసవృష్టి ప్రేక్షకులపై కురిపించిన రీతి, ఆ వర్తకుని పాత్రపోషణ సందర్భోచితంగా ఉంది. పురోహితుని పాత్రచిత్రణ కూడ వీరు కల్పించిందే. పురోహితునిచేత పలికించిన సంభాషణ సంభాషణమై మాధవవర్మ వ్యక్తిత్వానికి అద్దం పడుతుంది. యువరాజును మెత్తగా మంద లిస్తుంది.

మాధవవర్మ ఎన్నో రాచకార్యాలలో నిమగ్నమైనా గూఢచరుల ద్వారా ఎప్పటికప్పుడు దేశసమస్యలు తెలుసుకొని ప్రజల బాగోగులతోపాటు విద్యారంగం లోని పురోగతిని తెలుసుకొంటున్నట్లు అందెవారు మహామంత్రి సంభాషణ ద్వారా ఆనాటి విద్యావ్యవస్థను, అవస్థలను ఈనాడు విద్యాలయాలలో ఉపాధ్యాయుల కొరత ఉన్నవిధం ఆనాడు కూడ కలదని విద్యాధికారి నివేదికను మంత్రిద్వారా రాజుకు వినిపించిన తీరు, కళలు, శాస్త్రాలు, శిల్పసృష్టి సంస్కృత భాషాపోషణ, వైదిక మతంపట్ల ఆకర్షణ మొదలగు అంశాలను సంభాషణలను వివిధ పాత్రల ద్వారా పలికించి మాధవవర్మ ధర్మ కర్మలకు అద్దం పట్టించినారు అందెవారు.

ఈ నాటకంలో మాధవవర్మ, వృద్ధవనిత, యువరాజు ముఖ్యపాత్రలు. ఈ పాత్రలే నాటకంలోని కథకు జీవనాడులు. వీటిలో ఏ ఒక్కపాత్ర లేకున్నా కథాకథనం ముందుకు సాగదు.. నాయకుడైన మాధవవర్మ ధర్మం మూర్తీభవించిన వ్యక్తి. పేదవాడు తప్పుచేసినా పేరున్నవాడు తప్పుచేసినా శిక్ష ఇద్దరికీ సమానమని భావించే పక్షపాతధోరణి ప్రదర్శించని వ్యక్తిత్వం, శీలం కలవాడు. మాధవవర్మ ధర్మాసనంపై కూర్చున్నంత సేపు రాగద్వేషాలకు అతీతుడు. తప్పుచేసిన తన ఏకైక పుత్రునికి ఉరిశిక్ష విధించి నప్పుడు ఏ మాత్రం చలించక గంభీరవదనంతో సభాసదులకు కనిపిస్తాడు. సింహాసనం దిగిన తర్వాత పుత్ర వియోగంతో మిక్కిలి కుమిలి పోతాడు. అతని అవస్థను చూసిన మహామంత్రి శిక్ష తప్పించుటకు రాజుకు అధికారం కలదనీ యువరాజు బుద్ధిపూర్వకంగా పేద యువకునిపై రథం తోలలేదనీ పరిస్థితులనుబట్టి అత్యవసరమయ్యే ప్రముఖ వ్యక్తులకు క్షమాభిక్ష పెట్టవచ్చునని ధర్మశాస్త్రం చెబుతున్నదనీ చెప్పగానే మీ అభిప్రాయం "రాజ్యాంగానికి రాజధర్మానికి సరిపడదు. నిష్పక్ష పాతంగా దోషులను వదలివేస్తే న్యాయవ్యవస్థ చెడి పాపభీతిలేక ప్రజలు విచ్చలవిడిగా ఘోర కృత్యాలకు ఎగబడగల"రని "యువరాజుకు శిక్షపడవలసిందే"నని కఠినంగా పలికినప్పుడు మాధవవర్మ పాత్ర ఎంతటి మహోన్నతిని సంతరించుకుందో అర్థమవుతుంది.

రథ చక్రాలక్రిందపడి నలిగిపోయిన తన కొడుకును వృద్ధ వనిత మోసుకొని వచ్చి రాజభవనంలో చొచ్చి ధర్మఘంట ధైర్యంగా మ్రోగించినప్పుడు ఆమెలో దాగిన ఉక్రోశం, తెగువ, భావసంఘర్షణ, ఆమె నోటినుండి వెలువడిన

మాటలు ఈటెలై రాజును ప్రశ్నించినాయి. ఆమె వేషం, భాష, భాషలోని భావం ప్రేక్షకుల హృదయాలను ఉద్వేగపరుస్తాయి. ఈ విధంగా అందెవారు వృద్ధురాలి పాత్రను కనులకు కట్టినట్లు చిత్రించినారు.

అందెవారు యువరాజు పాత్రను సద్గుణ సంపన్నునిగా చిత్రీకరించినారు. "ఉద్రేకంతో కట్టలు తెంచుకొని నీరు ప్రవహిస్తే ఆ నీరూ నిలువదు, ఆ ఊరూ నిలువదు కదా" అని పురోహితుడు యువరాజుతో హితోక్తులు చెప్పునప్పుడు గర్వాంధకారుడై అతడు పురోహితుని మాటలు పెడ చెవిని పెట్టక "గురు జనుల హితం ఆచరించడానికి యథాశక్తి కృషి చేస్తాను" అని వినయంగా విధేయంగా సమాధానం చెప్పినప్పుడు యువరాజు వ్యక్తిత్వం, గుణస్వభావాలు ఎలాంటివో ప్రేక్షకులకు వెంటనే అర్థమైపోతాయి. మాధవవర్మకు శత్రువులైన కళింగ గాంగులు కంటకాలై సరిహద్దులను రక్షించే సైనికులను కవ్విస్తున్న సమయాన "యువరాజా! ఇలాంటి పరిస్థితిలో మనం ఏంచేస్తే యుక్తంగా ఉంటుంది? అని మహామంత్రి యువరాజుతో అన్నప్పుడు "కుక్కకాటుకు చెప్పుదెబ్బవలె చేస్తేకాని చక్కబడదు. కళింగ భూభాగాలను ఆక్రమించుకుంటె బుద్ధి రాగలదు" అని యువరాజు మంచన పలికిన మాటల్లో దేశభక్తి, అతని భుజబలం ఏ పాటిదో అర్థమవుతుంది.

ఈ నాటకంలో చంద్రావతీదేవి పాత్రను సృష్టించి ప్రాణం పోసింది అందె వారే. ఈమె మధ్య వయసులోఉన్నా వన్నె తరుగని రూపరేఖా విలాసాలు గలది. భర్తకు అణకువగా, ఎదలోని ఎదగా రాచకార్యాలలో నిమగ్నమై అలసి పోయిన భర్తను మురిపించే మువ్వగా, గుణవతిగా, శీలవతిగా మలచినారు. తన ఏకైక పుత్రునికి ఉరిశిక్షపడిన విషయం తెలుసుకొని కన్నీరు మున్నీరుగా విలపించి "ప్రభూ మీ ధర్మబుద్ధికి సకల దేవతలు సంతోషించవచ్చు. దుర్గా మల్లేశ్వరుడు మెచ్చి వరాలీయ వచ్చు. కాని చిరంజీవిని బాసి నేను బ్రతుక లేనండి" అని తన మనోవ్యథను వ్యక్తపరచినప్పుడు ఆమెకు పుత్రవాత్సల్యం ఎంత కలదో ద్యోతకమవుతుంది.

ఈ నాటకంలో ప్రధాన రసం ధర్మవీరం. మాధవవర్మ వేసిన ప్రతి అడుగులో, పలికిన ప్రతి నుడుగులో నాటకం అంతం వరకు ధర్మం దర్శన

మిస్తుంది. అందుకే అతడు ధర్మవీరుడు. ధర్మవీరత్వానికి మెచ్చి దుర్గా మల్లేశ్వరుడు కనక వర్షం కురిపించాడు. మాధవవర్మ జన్మను తరింపజేశాడు. ఈ నాటకములో హాస్య శృంగారాద్భుతరసాలు కొలనులో అలల వలె కనిపించి మాయమవుతాయి. ధర్మవీరం తర్వాత కరుణరసం రెండవ స్థానాన్ని ఆక్రమించింది. రథ చక్రాల క్రింద పేద యువకుడు మాంసం ముద్దైన వేళ, వృద్ధ మాత రాజసభలో శవంపైపడి గోడుగోడుగా విలపించిన సందర్భం, యువ రాజుకు ఉరిశిక్ష అమలైన నాటివరకు రాజు, రాణి, మహామంత్రి, పురోహితుడు, ప్రజలు వ్యక్తపరచిన వేదనలో ఆవేదనలో కరుణరసం ప్రేక్షకులను కలవర పెడుతుంది. కన్నీరు కారిస్తుంది. దుర్గా మల్లేశ్వరుని కరుణా కటాక్షాల వల్ల పేద యువకుడు, యువరాజు పునర్జీవులగుట వల్ల ఈ నాటకం సుఖాంతమవుతుంది.

డా॥ అందె వారు ఈ నాటకంలో రెండు పాటలను సందర్భోచితంగా ప్రవేశపెట్టినారు. రాజనర్తకి వచ్చి రాజ దంపతుల ముందు తన హాయలు, లయలు ఒలుకబోసి శృంగార గీతంపాడి నృత్యం చేయక శివస్తుతి గల పాట పాడి, ఆట ఆడి భక్తిరససిక్త హృదయాల్ని ఆవిష్కరిస్తుంది. ఈ సన్నివేశం చాల యుక్తియుక్తంగా ఉంది. యువరాజు ఉరిశిక్ష వార్త విని రాణి మిక్కిలి చలించి తన ఇలవేల్పైన దుర్గామాత ముందు ఆవిష్కరించిన నివేదన, వేదనతో కూడిన పాట. భావ గర్భితంగా రసస్ఫోరకంగా ఉంది. అందె వారికి దుర్గా మాతపై గల భక్తిప్రపత్తులను తెలుపుతుంది.

ఈ ఉత్తమ నాటకం పండిత పామర జనరంజకమై విరాజిల్లగలదనుటలో ఎట్టి సందేహం లేదు.

డా॥ అందె వారు ఆయురారోగ్యాలతో జీవన వృక్షానికి శత వసంతాలు సంతరించుకొని, శతాధిక గ్రంథాలు రచించి సాహిత్య సుగంధాలు పంచి ఆంధ్ర దేశాన్ని పరిమళింపజేస్తారని ఆకాంక్ష.

కోరుట్ల

ఇట్లు

**బైరి నరసయ్య,** ఎం. ఏ., బి. ఓ. ఎల్.

తెలుగు పండితుడు

సాంస్కృతిక కార్యదర్శి

భారతీ సాహిత్య సమితి

మాటలు ఈ రెబెల్లై రాజును ప్రశ్నించినాయి. ఆమె వేషం, భాష, భాషలోని భావం ప్రేక్షకుల హృదయాలను ఉద్వేగపరుస్తాయి. ఈ విధంగా అందెవారు వృద్ధురాలి పాత్రను కనులకు కట్టినట్లు చిత్రించినారు.

అందెవారు యువరాజు పాత్రను సద్గుణ సంపన్నునిగా చిత్రీకరించినారు. "ఉద్రేకంతో కట్టలు తెంచుకొని నీరు ప్రవహిస్తే ఆ నీరూ నిలువదు, ఆ ఊరూ నిలువదు కదా" అని పురోహితుడు యువరాజుతో హితోక్తులు చెప్పినప్పుడు గర్వాంధకారుడై అతడు పురోహితుని మాటలు పెడ చెవిని పెట్టక "గురు జనుల హితం ఆచరించడానికి యథాశక్తి కృషి చేస్తాను" అని వినయంగా విధేయంగా సమాధానం చెప్పినప్పుడు యువరాజు వ్యక్తిత్వం, గుణస్వభావాలు ఎలాంటివో ప్రేక్షకులకు వెంటనే అర్థమైపోతాయి. మాధవవర్మకు శత్రువులైన కళింగ గాంగులు కంటకాలై సరిహద్దులను రక్షించే సైనికులను కవ్విస్తున్న సమయాన "యువరాజా! ఇలాంటి పరిస్థితిలో మనం ఏంచేస్తే యుక్తంగా ఉంటుంది? అని మహామంత్రి యువరాజుతో అన్నప్పుడు "కుక్క కాటుకు చెప్పుదెబ్బవలె చేస్తేకాని చక్కబడదు. కళింగ భూభాగాలను ఆక్రమించుకుంటె బుద్ధి రాగలదు" అని యువరాజు మంచన పలికిన మాటల్లో దేశభక్తి, అతని భుజబలం ఏ పాటిదో అర్థమవుతుంది.

ఈ నాటకంలో చంద్రావతీదేవి పాత్రను సృష్టించి ప్రాణం పోసింది అందె వారే. ఈమె మధ్య వయసులో ఉన్నా వన్నె తరుగని రూపరేఖా విలాసాలు గలది. భర్తకు అణకువగా, ఎదలోని ఎదగా రాచకార్యాలలో నిమగ్నమై అలసిపోయిన భర్తను మురిపించే మువ్వగా, గుణవతిగా, శీలవతిగా మలచినారు. తన ఏకైక పుత్రునికి ఉరిశిక్షపడిన విషయం తెలుసుకొని కన్నీరు మున్నీరుగా విలపించి "ప్రభూ మీ ధర్మబుద్ధికి సకల దేవతలు సంతోషించవచ్చు. దుర్గామల్లేశ్వరుడు మెచ్చి వరాలీయ వచ్చు. కాని చిరంజీవిని బాసి నేను బ్రతుకలేనండి" అని తన మనోవ్యథను వ్యక్తపరచినప్పుడు ఆమెకు పుత్రవాత్సల్యం ఎంత కలదో ద్యోతకమవుతుంది.

ఈ నాటకంలో ప్రధాన రసం ధర్మవీరం. మాధవవర్మ వేసిన ప్రతి అడుగులో, పలికిన ప్రతి నుడుగులో నాటకం అంతం వరకు ధర్మం దర్శన

మిస్తుంది. అందుకే అతడు ధర్మవీరుడు. ధర్మవీరత్వానికి మెచ్చి దుర్గా మల్లేశ్వరుడు కనక వర్షం కురిపించాడు. మాధవవర్మ జన్మను తరింపజేశాడు. ఈ నాటకములో హాస్య శృంగారాద్భుతరసాలు కొలనులో అలల వలె కనిపించి మాయమవుతాయి. ధర్మవీరం తర్వాత కరుణరసం రెండవ స్థానాన్ని ఆక్రమించింది. రథ చక్రాల క్రింద పేద యువకుడు మాంసం ముద్దైన వేళ, వృద్ధ మాత రాజసభలో శవంపైపడి గోడుగోడుగా విలపించిన సందర్భం, యువ రాజుకు ఉరిశిక్ష అమలైన నాటివరకు రాజు, రాణి, మహామంత్రి, పురోహితుడు, ప్రజలు వ్యక్తపరచిన వేదనలో ఆవేదనలో కరుణరసం ప్రేక్షకులను కలవర పెడుతుంది. కన్నీరు కారిస్తుంది. దుర్గా మల్లేశ్వరుని కరుణా కటాక్షాల వల్ల పేద యువకుడు, యువరాజు పునర్జీవులగుట వల్ల ఈ నాటకం సుఖాంతమవుతుంది.

డా॥ అందె వారు ఈ నాటకంలో రెండు పాటలను సందర్భోచితంగా ప్రవేశపెట్టినారు. రాజనర్తకి వచ్చి రాజ దంపతుల ముందు తన హొయలు, లయలు ఒలుకబోసి శృంగార గీతంపాడి నృత్యం చేయక శివస్తుతి గల పాట పాడి, ఆట ఆడి భక్తిరససిక్త హృదయాల్ని ఆవిష్కరిస్తుంది. ఈ సన్నివేశం చాల యుక్తియుక్తంగా ఉంది. యువరాజు ఉరిశిక్ష వార్త విని రాణి మిక్కిలి చలించి తన ఇలవేల్పైన దుర్గామాత ముందు ఆవిష్కరించిన నివేదన, వేదనతో కూడిన పాట. భావ గర్భితంగా రసస్ఫోరకంగా ఉంది. అందె వారికి దుర్గా మాతపై గల భక్తిప్రపత్తులను తెలుపుతుంది.

ఈ ఉత్తమ నాటకం పండిత పామర జనరంజకమై విరాజిల్లగలదను టలో ఎట్టి సందేహం లేదు.

డా॥ అందె వారు ఆయురారోగ్యాలతో జీవన వృక్షానికి శత వసంతాలు సంతరించుకొని, శతాధిక గ్రంథాలు రచించి సాహిత్య సుగంధాలు పంచి ఆంధ్ర దేశాన్ని పరిమళింపజేస్తారని ఆకాంక్ష.

కోరుట్ల

ఇట్లు

**బైరి నరసయ్య**, ఎం. ఏ., బి. ఓ. ఎల్.

తెలుగు పండితుడు

సాంస్కృతిక కార్యదర్శి

భారతీ సాహిత్య సమితి

# అంకితం

కటుకము వంశాబ్ధిచంద్ర!
ఘనకీర్తీ! సంగయ్యా!
కటువొకింత మాటలైన
కడుమెత్తని మనసయ్యా!

తపస్సువలె వ్యాపారం
దశాబ్దాలు చేసినావు
సిరిసంపదలతో పాటు
చిరకీర్తిని గాంచినావు.

ఐశ్వర్యం పెంపైనా
అహంకార మొందలేదు
అధికుల స్నేహంబైనా
అల్పజనుల మరువలేదు.

పేదరికపు కష్టాలకు
పెన్నిధిలో సౌఖ్యాలకు
క్రుంగలేదు పొంగలేదు
గొప్ప కృషిని విడువలేదు.

కవిత్వమ్ము రమ్య నటన
కౌశలమ్ము కలవాడా!
సరసత్వం, దైవభక్తి,
పరోపకృతి కలవాడా!



కృతిపతి

శ్రీ కటుకం సంగయ్య

నీతికి, లోకమ్ము మెచ్చు
రీతికి, వాణిజ్య కృషి
ఖ్యాతికి, బహుళార్థిజన
ప్రీతికి ఎద కలవాడా !

ఆబాల్యం కలిసి మెలసి
ఆటలలో గడపితిమి
సభలు నాటకా లెన్నో
సమర్థముగ నడపితిమి.

తమ్మయ్యా ! నీ కీ మా
ధవవర్మను సమర్పింతు
కైకొని శ్రీ దుర్గాంబా
కరుణన్ శుభములు గాంచుము.



# కృతిపతి పరిచయం

కోరుట్ల పట్టణ ప్రముఖులలో ఒకరై కీర్తి ప్రతిష్ఠ లార్జించినవారు ఈ నాటకాన్ని అంకితం తీసుకొన్న శ్రీ కటుకం సంగయ్యగారు. వీరు కోరుట్లలో ఒక సామాన్య పద్మశాలి కుటుంబంలో శ్రీమతి లక్ష్మవ్వ శ్రీ రాజయ్య గారనే పుణ్యదంపతులకు వంశదీపకులై తేది 5-10-1935లో జన్మించిరి. వీరికి నాలుగు సంవత్సరాల శైశవ దశలోనే తండ్రి గతించెను. సంగయ్యగారు ఒక అన్న, ముగ్గురు అక్కల తర్వాత జన్మించిన కనిష్ఠ పుత్రులు. చిన్ననాడు దుర్భరమైన ఆర్థిక దుస్థితిలో వీరి తల్లి కుటుంబభారాన్ని వహించినది. ఈకారణంగా సంగయ్య గారు ఏడవ తరగతికంటె ఎక్కువ చదువలేకపోయిరి. పగలంతా బడికి వెళ్ళి అర్ధరాత్రివరకు ఇంటిలో మగ్గంనేసి కష్టంగా చదువు సాగించినారు.

1953లో నిజామాబాద్ జిల్లాలో అధ్యాపకులుగా నియమితులై ఇ.జి.బి.టి. ఉపాధ్యాయ శిక్షణ పొంది పలుగ్రామాలలో విద్యాబోధనచేసి 1962లో అధ్యాపక వృత్తిని వదలి వారి మామ శ్రీ చిదుమల్ల ఎల్లయ్య గారి ప్రోత్సాహంతో వస్త్ర వ్యాపారం ప్రారంభించి దీక్షాదక్షతలతో 14 సంవత్సరాలు తపస్సువలె ఆ వృత్తి చేసి శ్రీమంతులైనారు. ఆ పిదప శ్రీయుతులు ఎం.ఏ. జబ్బార్, ఏ.ఏ. నయీం గారలతో ఫ్రెండ్స్ బీడి లీవ్స్ కంపని పేరుతో బీడి ఆకు వ్యాపారం పది సంవత్సరాలు చేసి సంపద్వైభవంతో సుఖశాంతులతో కుటుంబ జీవనం సాగించి పుత్రులకు వస్త్రవ్యాపారం అప్పగించి 1989 నుండి విశ్రాంతి తీసుకొంటున్నారు.

సంగయ్యగారిది బృహత్కుటుంబం. ఎల్లయ్యగారి పుత్రికలిద్దరిని శ్రీమతులు భూదేవి లక్ష్మిబాయిగారలను వివాహము చేసుకొని మామగారికి పుత్ర సంతానం లేనందున ఇల్లటపు అల్లునిగా ఉన్నారు. వీరికి చిరంజీవులు రాజేశ్వర్, జగదీశ్వర్, కోటేశ్వర్, పరమేశ్వర్, మహేశ్వర్ అనే పుత్రులు, విజయలక్ష్మి, జయలక్ష్మి, వరలక్ష్మి, భాగ్యలక్ష్మి, ధనలక్ష్మి, భరతలక్ష్మి, సదాలక్ష్మి అనే పుత్రికలు కలిగినారు.



* శ్రీ కటుకం సంగయ్యగారి కుటుంబసభ్యులు *

మీది వరుస : ఎడమనుండి కుడికి : జగదీశ్వర్, రాజేశ్వర్, కోటీశ్వర్, పరమేశ్వర్, వెంకటేశ్వర్ (పుత్రులు)
ధనలక్ష్మి, భారతలక్ష్మి, సదాలక్ష్మి, (పుత్రికలు), మిగిలిన నలుగురు అల్లుండ్రు

మధ్యవరుస : ఎడమనుండి కుడికి : భాగ్యవతి, రమాదేవి (కోడండ్రు), బుచ్చిరాజు (అత్తమ్మ) భూదేవి, లక్ష్మి (ధర్మపత్నులు)
(మధ్య సంగయ్యగారు), విజయలక్ష్మి, జయలక్ష్మి, వరలక్ష్మి, భాగ్యలక్ష్మి (కూతుండ్రు)

క్రింది వరుస : ఎడమనుండి కుడికి : శ్వేత, వంశీచైతన్య, హర్షచైతన్య, నవీన్‌రాజు, ప్రవీణ్‌రాజు, సింధూరి, నిఖిత, శైలజ
మధ్య వరుసలోని చంటి పిల్లలు : హరిత, అమిత్‌కుమార్ (మనుమలు, మనుమరాండ్రు).

చి॥ రాజేశ్వర్ వస్త్ర వ్యాపారం సాగిస్తూ జీవితబీమా ఏజంటుగా ప్రగతి పథంలో పయనిస్తున్నాడు. కుశాగ్రబుద్ధి, చురుకైన కార్యశీలి. విద్యార్థి దశలో నాటకాలలో నటించి మంచి నటునిగా పేరు తెచ్చుకున్నాడు. అతని అర్ధాంగి సౌ॥ రమాదేవి. ఈ దంపతుల చిరంజీవులు కృష్ణచైతన్య, హర్షచైతన్య. చి॥ జగదీశ్వర్ వస్త్రవ్యాపారానికి అంకితమై అభివృద్ధి దశలో నిర్వహిస్తున్నాడు. అనేక నాటకాలు ముఖ్యంగా ఏకపాత్రలు అభినయించి మేటి నటునిగా ప్రశంసలు పొందినాడు. అతని అర్ధాంగి సౌ॥ భాగ్యవతి. వీరి చిరంజీవులు వంశీచైతన్య, విష్ణుచైతన్య, శ్వేత. చి॥ కోటేశ్వర్ ప్రతిభావంతుడై బి. టెక్. (మెకానికల్) చదువుతున్నాడు. చి॥ పరమేశ్వర్ ఇంటర్, చి॥ మహేశ్వర్ 10వ తరగతి చదువుతున్నారు. చి॥ సౌ॥ విజయలక్ష్మి భర్త శ్రీ బాస రాజేశ్వర్ వర్తకుడు. చి॥ సౌ॥ జయలక్ష్మి భర్త దొంతుల ప్రసాద్ బి. ఏ. పట్టభద్రుడు. చర్మశుద్ధి వ్యాపారం చేస్తున్నాడు. చి॥ సౌ॥ వరలక్ష్మి (శారద) భర్త రాజుల బాలకృష్ణ ఎలక్ట్రానిక్స్‌లో డిప్లొమా చదివి ఎలక్ట్రానిక్ పని చేస్తున్నాడు. చి॥సౌ॥ భాగ్యలక్ష్మి బి. ఏ. భర్త చింత విఘ్నేశ్వర వరప్రసాద్ బి. ఇ. (సివిల్) పట్టభద్రుడై నిజామాబాదులో బాలికల పాలిటెక్నిక్ కళాశాలలో లెక్చరర్‌గా ఉద్యోగం చేస్తున్నాడు. చి॥ సౌ॥ ధనలక్ష్మి బి. కాం. భర్త వేముల శరత్‌బాబు బి. ఇ. (ఎలక్ట్రానిక్స్) పట్టభద్రుడై ప్రైవేటు కంపెనిలో ఉద్యోగం చేస్తున్నాడు. చి॥ భరతలక్ష్మి బి. కాం. చదువుతున్నది. చి॥ సదాలక్ష్మి 8వ తరగతి చదువుతున్నది.

సంగయ్య తండ్రి రాజయ్య కళాకారుడై పీర్ల పండుగ సందర్భంలో విచిత్ర వేషధారణ చేసి జనులను అలరించేవాడు. శుక్రవారం పూజ అయ్యగారుగా మన్ననలు పొందినవాడు. సంగయ్య అన్న రాజమల్లు మంచి నటుడు, గాయకుడు. బుఱ్ఱకథలు చెప్పడంలో మంచి నేర్పరి. ఆయన కొన్నేండ్ల క్రింద కీర్తిశేషుడాయెను.

ఉత్తమాధ్యాపకుడుగా పేరుగాంచిన సంగయ్య గారు కవిత్వంలోను, అభినయ కళలోను మంచి అభినివేశం కలవారు. విద్యా సంబంధమైన బుఱ్ఱ కథలు, ఖండకవితలు, పద్యాలు, ఉయ్యాల పాటలు రచించినారు. అనేక నాటకాలలో మేటిపాత్రలు "ఢిల్లీకోట"లో సుభాస్‌చంద్రబోసుగా, "లవకుశ"లో

రాముడుగా ఇత్యాదిగా నటించి నట శేఖరునిగా ప్రశంసితులైనారు. "గొల్లవాడు" ఏకపాత్రాభినయం చేసి పెక్కు బుఱ్ఱకథలు మనోరంజకంగా చెప్పినారు. దాస బోధ మొదలగు సద్గ్రంథాల పురాణ ప్రవచనం చేసినారు.

వ్యాపారరంగంలో పట్టుదల ప్రజ్ఞ నిరంతరకృషి వలన అచిరకాలంలోనే మంచి అభివృద్ధి సాధించి ధనాన్ని, కీర్తిని సంపాదించినారు. గతంలో బట్టల వర్తకసంఘానికి కోశాధికారిగా ఉండిరి. కోరుట్లలో వెలసిన శ్రీ షిర్డి సాయిబాబా భక్త సమాజానికి పూర్వం కోశాధికారిగా ఉండి ప్రస్తుతం లెక్కల పరిశీలకులుగా సలహాదారుగా సేవలందిస్తున్నారు. శేష జీవితాన్ని కుటుంబ సంరక్షణతో దైవ చింతనలో గడుపగలనన్న ఆశయాన్ని వెలిబుచ్చినారు. వీరు, ఇటీవల మద్గురు దేవులైన కుండలినీ జ్ఞానయోగులు, అవధూత శ్రీశ్రీశ్రీ గోవిందగిరి స్వాముల వారి వద్ద యోగదీక్ష పొంది నిష్ఠ చేస్తూ ప్రశాంతంగా కాలం గడుపుతున్నారు.

ఒకనాడు ఆర్థికదుస్థిలో అలమటించిన సంగయ్య గారు అనేక కష్ట నిష్ఠురాలకోర్చి మహాసంపన్నులైనా నాటి వ్యధలు మరిచిపోలేదు. సంపద పెంపైనా అహంకరించలేదు. ఆడంబరాలకు పోలేదు. తననాశ్రయించిన వారికి యథాశక్తి ఆర్థికాది విషయాలలో సహకరిస్తున్న పుణ్యమూర్తులు.

సంగయ్యగారు నాకు వరుసకు తమ్ములు. ఇద్దరం కలిసి బాల్యంలో ఆట పాటలతో, నాటకాలతో, సభలతో కాలక్షేపం చేసినాము. అనురాగంతో జీవితాలు గడుపుతున్నాము. ఆ ఆత్మీయతకే ఈ నాటకం అంకితం చేసినాను.

# విన్నపం

సహృదయ సాహితీ బంధువులారా !

ఈ మాధవవర్మ నాటకం నా ముద్రిత కృతులలో ఎనిమిదవది. నేను స్థాపించుకున్న మహేశ్వరీ గ్రంథ మండలి ప్రచురణలలో ఐదవది.

నాకు బాల్యంనుండి పాటలు పద్యాలతోపాటు నాటకాలపై అభిరుచి. అపుడపుడు నాటకాలు, నాటికలు వేయించిన అనుభవం ఉన్నది. అధ్యాపకత్వంలో అనేక నాటకాలు, నాటికలురచించి విద్యార్థులచేత వేయించి రసజ్ఞులైన సామాజికుల ఆమోదం పొందితిని. 1971లో ఆ నాటికలను సంకలనంచేసి 'భారతరాణి' అన్న కృతిని, 'భువన విజయం' అన్న నాటికను ప్రచురించిన విషయం సాహితీలోకానికి విదితమైనదే.

ప్రస్తుత నాటకం చరిత్రాత్మకమైనది. చరిత్రలో మాధవవర్మ కథ చదివి అతని ధర్మబుద్ధికి న్యాయనిష్ఠకు మిక్కిలి ప్రభావితుడనై సమాజానికి ఇది గొప్ప ఉపదేశాత్మకంగా ఉంటుందని భావించి నాటకంగా రచించినాను. విష్ణుకుండి వంశానికి చెందిన మాధవవర్మ విజయవాడ రాజధానిగా కృష్ణాగోదావరీ నదుల నడుమగల ఆంధ్రదేశాన్ని క్రీ.శ. 546-611 సంవత్సరాల మధ్య రాజ్యపాలన చేసిన ధర్మప్రభువు. నాటకంలోని కథ క్రీ.శ. 592లో జరిగినది. ఈ ఇతివృత్తం బెజవాడలో వెలసియున్న శ్రీ దుర్గామల్లేశ్వరస్వామి ఆలయంలోని 12వ శతాబ్దానికి చెందిన ఒక శాసనం వల్ల ప్రసిద్ధమైనది. మాధవవర్మ కుమారుడు మంచన భట్టారకుడు యువరాజు. వీరు శ్రీ దుర్గామల్లేశ్వరస్వామి ఆరాధకులు. మాధవవర్మ ప్రజానురంజకంగా పరిపాలించిన ఉత్తమమహారాజు. వైదికధర్మ కర్మపరాయణుడు. ఒకప్పుడు అరేబియా వర్తకుడమ్మిన ఉత్తమజాతి అశ్వాలను మదించినవి మచ్చికకానివి రథానికిపూన్చి రాకుమారుడు రాజవీధులనుండి వాహ్యాళికి వెళ్లుతుండగా చింతకాయలమ్ముకొనే ఒక పేద ముసలమ్మ కొడుకు రథచక్రం క్రింద నలిగి మరణిస్తాడు. శోకసంతప్తయైన ముసలమ్మ కొడుకు శవాన్ని మోసుకొని రాజుగారి మొగసాల చేరి ధర్మఘంట మ్రోగిస్తుంది. రాజు విషయం

తెలుసుకొని అభయమిచ్చి ఓదార్చి న్యాయ విచారణ జరిపిస్తాడు. పేద యువకుడు తన అజాగ్రత్త వల్లనే రథ చక్రం క్రింద పడి మరణించినాడనీ, రాజకుమారుడు నిర్దోషి యనీ ప్రాడ్వివాకుడు ధర్మాధికారి మంత్రి పురోహితు అభిప్రాయపడినా మాధవవర్మ వినక రాజకుమారుని నేరం నిరూపించి ధర్మ న్యాయాలు అందరికీ ఒక్కటేనని తన ఏకైక పుత్రుడన్న మమకారం చూపక ఉరిశిక్ష విధిస్తాడు. మాధవవర్మ ధర్మబుద్ధికి మెచ్చి దుర్గాదేవి విజయవాడలో కనకవర్షం కురిపించి రాకుమారుని పేదయువకుని పునర్జీవితులను చేస్తుంది. అప్పటి నుండి ఆ జగన్మాతకు కనకదుర్గాదేవియని ప్రశస్తి. ఇదీ స్థూలంగా దీనిలోని కథ.

ఈ నాటకం నాలుగు రంగాలుగా రచింపబడినది. నాటకాన్ని సంప్రదాయ లక్షణానుసారంగా కాకుండా ఆదునిక పద్ధతిలో రూపొందించినాను. అరేబియా వర్తకుని, మహారాణి చంద్రావతీ దేవిని, పురోహితుని పాత్రలను కల్పించి సందర్భోచితంగా పోషించినాను. పద్యాలు కూర్చక రెండు పాటలను మాత్రం పొందుపరచినాను. ఈ నాటకం ప్రధానంగా మాధవవర్మ న్యాయధర్మ నిష్ఠను, దుర్గాదేవి మహానుగ్రహాన్ని లోకానికి చాటుతున్నది.

ఈ నాటకానికి 'నాటకానికి ముందు నాలుగుమాటలు' వ్రాసిన మాన్యులు సహృదయ విద్వత్కవివరేణ్యులు డా॥ తిరుమల శ్రీనివాసాచార్యులుగారికి, 'రంగభూమిక' రచించిన ఆత్మీయులు కవివర్యులు, గాయక తిలకులు, నటశేఖరులు, దర్శకలలాములైన శ్రీ బైరి నరసయ్య గారికి కృతజ్ఞతలు.

ఈ నాటకాన్ని ఆత్మీయ సోదరులు సహృదయవరేణ్యులైన శ్రీ కటుకం సంగయ్యగారికి అంకితం చేసినాను. వారు ప్రేమతో స్వీకరించి గ్రంథముద్రణకు సముచిత ద్రవ్యసహాయం చేసినారు. వారికి కృతజ్ఞతలు.

గ్రంథానికి రమ్యమైన ముఖచిత్రం వేసియిచ్చిన ఆత్మీయులు, సుప్రసిద్ధ చిత్రకారులు శ్రీ అలిశెట్టి మహారాజు జగిత్యాల గారికి కృతజ్ఞతాభివందనాలు. చక్కని బ్లాకులు చెక్కియిచ్చిన మోహన్‌ప్రాసెస్ వారికి, మనోహరంగా ముఖ

చిత్రం ముద్రించి యిచ్చిన బాలాజి ఆర్ట్ ప్రింటర్స్ వారికి, సకాలంలో చక్కగా ముద్రించి యిచ్చిన మాధవి ప్రింటర్స్ శ్రీ ఊట్ల గణేశ్ బాబుగారికి కృతజ్ఞతలు.

ఈ నాటకం సహృదయ సామాజికుల మెప్పు గాంచగలదన్న విశ్వాసం కలదు.

ఇట్లు
మీ వాడు
**అందె వేంకటరాజము**



## -: పాత్రలు :-

మాధవవర్మ - మహారాజు

మంచన భట్టారకుడు - యువరాజు

చంద్రావతీదేవి - మహారాణి

పుల్లమ్మ - పేదముసలమ్మ

మహామంత్రి

పురోహితుడు

అరేబియా వర్తకుడు

ధర్మాధికారి

ప్రాడ్వివాకుడు

ప్రతీహారి

భటుడు

# మాధవవర్మ

## నాటకం

### మొదటి రంగం

(స్థలం : మాధవవర్మ మహారాజు ఆస్థానం. తెరలేచేసరికి మాధవవర్మ కొలువుతీరి సింహాసనాసీనుడై యుంటాడు. మహామంత్రి, రాజపురోహితుడు, యువరాజు మంచన భట్టారకుడు ఇరువైపుల సముచితాసనాలలో కూర్చుండి యుంటారు. నేపథ్యం నుండి వంది మాగధులకైవారాలు వినిపిస్తాయి.)

వందిమాగధుల కైవారాలు (నేపథ్యంలో)

జయజయ శ్రీమద్విష్ణుకుండి వంశక్షీరాంభోధి పూర్ణచంద్రా!
జయజయ కృష్ణాగౌతమీ మధ్యస్థ మహాంధ్రధరణీతలేంద్రా!
జయజయ నిరుపమ నిజశౌర్యదీధితిచ్ఛటావిభాసిత దిగంతరాళా!
జయజయ మహోజ్జ్వలసింహలాంఛనధ్వజచ్ఛాయాసంతోషిత ప్రజాజాలా!
జయజయ శ్రీదుర్గామల్లేశ్వర పాదారవిందభృంగా!
జయజయ పరమవైదిక ధర్మకర్మనిరతాంతరంగా!
జయజయ భగవత్ శ్రీపర్వతస్వామి పాదానుధ్యాతా!
జయజయ త్రికూటమలయాధిపనామ విఖ్యాతా!
జయజయ త్రివరనగరయువతీ మనోహరా!
జయజయ జనాశ్రయ బిరుదగుణరత్నాకరా!
జయజయ సకలజనవినుత-అపరధర్మరాజా!
జయజయ మనుమార్గచరిత-ఆశ్రిత కల్పభూజా!
జయజయ శ్రీవిలసితవిజయ వాటికాపురవరేశ్వరా!
జయజయ శ్రీమద్రాజాధిరాజ మాధవవర్మ మహామహేశ్వరా!
జయీభవ! విజయీభవ!

మాధవవర్మ - మహామంత్రీ! ప్రజలందరూ సుఖులేకదా!

మహామంత్రి - అపరధర్మరాజులైన తమ చల్లని పరిపాలనలో ప్రజలందరూ ఏతాపమూ లేక సుఖంగా ఉన్నారు మహారాజా! అంతరూ తమరిని వేనోళ్ల పొగడుతుంటారు.

మాధవ - మేము కాంక్షించేది మాపొగడ్త కాదు.

పురోహితుడు - అది ప్రజల పొగడ్త. అదే ప్రభువుల పొగడ్త జగమంతా ప్రకాశితమై ఆనందిస్తుంది అనగా ఆ ప్రతిష్ఠ సూర్యునిదికాదా? తన చల్లని నీడలో హాయిగా ప్రాణాలు సేదతీరుతాయి అంటే ఆ కీర్తి శాఖోపశాఖలుగా విస్తరిల్లివిలసిల్లే మహావటవృక్షానిది కాదా? అల్లే ప్రజాశ్రేయస్సే ప్రభువులను కీర్తింపజేస్తుంది.

మహా - ప్రభువులు ఆత్మస్తుతి పరాఙ్ముఖులు.

మాధవ - ఆత్మస్తుతి పరనిందతో సమానం కదా! ఇంతకు దేశప్రజలకు కలిగే సుఖశాంతులట్లుండగా వారికింకేమి లోటుపాటులు కష్ట నష్టాలు ఉన్నవో విచారించవలసియున్నది. ప్రజలకు మన యెడగల భక్తివిశ్వాసాలకు ధన్యులము. మన యందలి ప్రేమాభిమానాల చేత వారలా స్తుతిస్తుంటారు. కాగా మన పరిపాలన గురించి పరోక్షంలో వారేమని విమర్శించుకొంటున్నారో వినగోరుతాము.

పురో - నాయనా యువరాజా! శ్రద్ధగా గ్రహిస్తున్నావయ్యా మహారాజు గారి సద్వాక్యాలు.

మంచన భట్టారకుడు - ఆచార్యదేవులు, మహామంత్రిగారు బోధించిన రాజనీతి విశేషాలను ఇపుడిపుడే సరిగా అవగాహన చేసుకొంటున్నాను.

మాధవ - గురుజనుల సుశిక్షణలో చిరంజీవి శీఘ్రగతి విజ్ఞుడై సమర్థకార్య శూరుడైతే మాకు భారంతగ్గి ఊరట కలుగుతుంది.

మహా - కడచిన విజయదశమీశుభావసరాన యౌవరాజ్య పట్టాభిషిక్తుడై

నప్పటి నుండి చిరంజీవి మంచన భట్టారకుడు మహోత్సాహంతో రాజకార్యాలలో పాల్గొంటున్నాడు.

మంచన - ఔను నాన్నగారు! పెద్దల ఆశీర్వచనం ఉంటేచాలు ఎంతటి దుర్ఘటకార్యాన్నైనా ధైర్యసాహసాలతో సాధించగలను.

మాధవ - ఒక్క ధైర్యసాహసాలే సరిపోవు. ఉత్సాహశక్తి ఒక్కటే చాలదు. దానితోపాటు ప్రభుశక్తి మంత్రశక్తి ప్రయోగించే దక్షత కావలెను. శక్తితోపాటు సామర్థ్యం, సాహసంతో పాటు సమ్యగ్విచారం ఉన్నప్పుడే ఘనకార్యాలు సుసాధ్యాలవుతాయి.

పురో - యువరాజు శక్తియుక్తులు వర్ణనాతీతాలు. మొన్న జరిగిన క్రీడలలో గుఱ్ఱపుస్వారి పందెంలో చిరంజీవి ఉరికించిన గుఱ్ఱం రెప్పపాటులో మాయమైనది. తక్కిన యువకులందరూ దాని ధూళిలో కలిసిపోయినారు. మహామంత్రిగారి కుమారుడొక్కడు మాత్రం రాకుమారుని తర్వాత అంతటివాడనిపించుకొన్నాడు. మహారాజ మహామంత్రులవలెనే చిరంజీవులిద్దరునూ అద్వితీయంగా అన్యోన్యంగా విహరిస్తుండడం చూచి ఆనందించి అభినందించని వారు లేరు.

మహా - (సంతోషంతో చిరునవ్వు నవ్వి) పురోహితులు బాగా వచించినారు. ఇంకా ఇద్దరు చిరంజీవుల ధైర్యసాహసాలకు బలపరాక్రమాలకు గత సంవత్సరం కళింగగాంగులతో జరిగిన యుద్ధం గొప్ప తార్కాణం. ఆ యుద్ధంలో ఇద్దరు యువవీరులు ప్రదర్శించిన ప్రతాపం మన విజయానికి ఎంతో తోడ్పడినది.

మంచన - ఆనాడు మనసేనాపతి ఆనపెట్టి యుండనిచో కళింగగాంగుల పూర్వ రాజధాని దంతపురాన్ని మంటకలిపే వాళ్లం.

మాధవ - కుమారుల మహాశౌర్యానికి మేమెంతో సంతోషించినాము. ఐనా చిరంజీవిలో తక్కిన వాటికంటె ఉత్సాహసాహసాలు మితిమీరి ఉన్నవనిపిస్తే న్యాయవిచారణ.

మహా - 'అతి సర్వత్ర వర్జయేత్' అన్నమాట వాస్తవమే, దానిని అదుపులో ఉంచవలసినదే. ఐనా ఉత్సాహోద్రేకాలతో పరుగులు పెట్టే వయస్సు బలీయమైనది.

మాధవ - ఆ వయస్సును పయస్సువలె పొంగిపోనీయగూడదనియే మా అభిమతం. యౌవనం మదించిన గుఱ్ఱం వంటిది. దానికి గట్టిగా కళ్ళెం వేయవలెను లేకుంటే ప్రమాదానికి దారితీసే అవకాశం ఉన్నది.

పురో - మహారాజుగారు చక్కగా సెలవిచ్చినారు. పడుచుతనంలో విజృంభించి పరుగులు తీసే కోరికలను నిగ్రహించుకోవడం మహాకష్టం. ఐనా నిగ్రహించి నిదానంగా సక్రమంగా సాగినపుడే సకల శ్రేయస్సులు కలుగుతాయి. చెరువులో నీరు కుప్పలు తెప్పలుగా నిండి తొలకే వేళకు సరియైన కట్టయుండి తూము ద్వారా ఒక పద్ధతిలో నీళ్ళువదలినప్పుడే పంటలకు సద్వినియోగం అవుతాయి. ఉద్రేకంతో కట్టలు తెంచుకొని నీరు ప్రవహిస్తే ఆ నీరూ నిలువదు ఊరూ నిలువదు కాదా!

మహా - యువరాజా! విన్నావయ్యా పురోహితుల హితవచనాలు.

మంచన - (వినయంగా) గురుజనుల హితం ఆచరించడానికి యథాశక్తి కృషి చేస్తాను.

మాధవ - మహామంత్రీ! కళింగ సరిహద్దును పరిశీలించబోయిన సేనాపతి ఇంకా రాజధానికి రాలేదా?

మహా - రాలేదు ప్రభూ! రేపు రావచ్చు.

మాధవ - వార్తలేమైనా తెలియవచ్చినవా?

మహా - వార్తాహరుడింతకు ముందే వచ్చినాడు. కళింగగాంగులు మన రాజ్యానికి ఈశాన్యదిశలో కంటకాల వలె ఉన్నారు. ఎన్నిసార్లు తన్ని తరిమివేసినా బుద్ధిరాదు. మాటి మాటికి సరిహద్దులు దాటుతు సరిహద్దులను రక్షించే మన సేనలను కవ్విస్తున్నారు. మొన్న కొంత తీవ్ర ఘర్షణ జరిగినదట.

మంచన - మనం అశ్రద్ధచేయరాదు. గట్టిగా దెబ్బతీయనిదే ప్రయోజనం కలుగదు. మన ధార్మికత మన సహనం వారికి అసమర్థతగా తోస్తున్నవి కాబోలు.

మహా - యువరాజా! ఇలాంటి పరిస్థితిలో మనం ఏమి చేస్తే యుక్తంగా ఉంటుంది?

మంచన - కుక్క కాటుకు చెప్పుదెబ్బవలె చేస్తేకాని చక్కబడదు. మరొకసారి గట్టిగా హెచ్చరిక చేసి గుణం కుదురనిచో సేనలను పంపి కళింగ భూభాగాలను ఆక్రమించుకొంటే బుద్ధిరాగలదు.

మహా - బాగా చెప్పినావు. చావుకు పెడితే లంకణానికి దిగుతుంది. అలాగే చేయవలె. సామం మొదలైన ఉపాయాలు ఫలించనప్పుడు దండమే ప్రయోగించవలసివస్తుంది. ఇంకా సరిహద్దుల మీది అటవికులను వశం చేసుకొని శత్రువులపై ఉసికొల్పవలెను.

మాధవ - ఈ ఆలోచన బాగున్నది. ఏమైనా సరిహద్దు సమస్యకు శాశ్వత పరిష్కారం కావలసినదే. లేకుంటే దేశభద్రతకే ముప్పురాగలదు. సరిహద్దు రక్షణ చేయజాలని ప్రభువు తాను నశించిపోవడమేకాక తనను నమ్ముకొన్న ప్రజలను నట్టేట ముంచినవాడౌతాడు. మనం శత్రువుల జోలికి పోయేదిలేదు. వారు మన జోలికివస్తే కొట్టక విడిచేదిలేదు. ఎప్పటికైనా శాంతిని ధర్మాన్ని విడనాడేదిలేదు. గౌరవ ప్రతిష్ఠలను విడనాడుకోవలసినది అంతకంటే లేదు.

మహా - మన విధానం తమరు సెలవిచ్చినదే. అలాగే చేస్తాము. ఐతే ప్రస్తుతం సేనాపతిని రానీయండి. అక్కడి విశేషాలు పూర్తిగా తెలుసుకొని కర్తవ్యం విచారించుకొందాము.

మాధవ - ఘటికాస్థానాలలో విద్యాబోధన సక్రమంగా సాగుతున్నదా మహామంత్రీ!

మహా - నాలుగైదు విద్యాలయాలలో మాత్రం అధ్యాపకుల కొఱతఉన్నదని విద్యాధికారి నివేదిక సమర్పించినాడు. కాగా ఆయా కళలు శాస్త్రాలు బాగానే బోధించబడుతున్నవి.

మాధవ - సంస్కృత భాషను చక్కగా అధ్యయనం చేస్తున్నారా? ఎందుకంటే అవైదికాలు నాస్తికాలు అన బౌద్ధ జైనమతాలు దేశమంతటా వ్యాపించి వైదిక ధర్మకర్మలకు కొంత విఘాతం ఏర్పడినది కదా! జైనం ఆంధ్రదేశంలో నామమాత్రమైనా బౌద్ధం ప్రబలంగా ఉండి క్రమంగా దిగజారి వామాచారాలు మెండుగా ప్రవేశించి దుర్భరమై ప్రజలకు దూరమైనట్టే. వైదికధర్మం భారతభూమికి మూలాధారమై విశ్వకల్యాణానికే కారకమై వెలుగొందేది కనుక దానిని మనం తీవ్ర కృషితో పునరుద్ధరిస్తున్నాము. వేదశాస్త్రాది సమస్త విద్యలకు సంస్కృతం ప్రధానంగా అభ్యసించవలసినది కదా!

మహా - బౌద్ధ వాసనగల ఏ కొందరో తప్ప తక్కిన వారెల్ల అత్యాసక్తితో చదువుకొంటున్నారు. శైవ వైష్ణవాగమ శాస్త్రాలు కూడ విరివిగా అధ్యయనం చేయబడుతున్నవి ప్రభూ!

పురో - దేవభాషయైన సంస్కృతానికి స్వర్ణయుగం వచ్చినది. యజ్ఞ యాగాది వైదిక కర్మలు గో బ్రాహ్మణ పూజ దైవభక్తి ప్రజలలో చక్కగా ప్రవర్తిల్లుతున్నవి. పరమవైదికులగు ప్రభువుల పరిపాలనలో దేశం సుభిక్షంగా ఉండి రామరాజ్యాన్ని తలపిస్తున్నది.

మాధవ - సమర్థులూ దేశధర్మభక్తి పరాయణులైన మీరందరూ సహకరిస్తుండగా ఏ ఘనకార్యం నెరవేరదు? ఇంతకూ మన సత్సంకల్పం సర్వదా సిద్ధింపజేయడానికి వరదుడు శ్రీ దుర్గామల్లేశ్వరస్వామియే ఉన్నాడు.

పురో - మనవి చేయ మరచినాను ప్రభూ! ఇంద్రకీల పర్వతంపైన శ్రీదుర్గా మల్లేశ్వరస్వామి ఆలయం సమీపంలో తొలిపించే గుహాలయాలు దాదాపు పూర్తికావచ్చినవి. ఇంకా తుది మెరుగులేమి దిద్దవలసి యున్నవో తాము స్వయంగా ఒకసారి చిత్తగించి సెలవీయవలెను.

మాధవ - మీ పర్యవేక్షణలో పని చురుకుగా సాగుతున్నందుకు సంతోషంగా ఉన్నది. అలాగే చూచి వస్తాము. (అని మహామంత్రితో) మహామంత్రీ! భైరవుని కొండపైన చెక్కుతున్న గుహాలయకార్యం ఎంత వరకు వచ్చెనో,

మహా - ఆ కార్యం పరిశీలించడానికి వెళ్ళిన రాజగురువులుగారు ఇంకా తిరిగిరాలేదు. పూర్తియై యుండుననియే భావిస్తున్నాను. కాగా ఈ విజయవాటికా నగరానికే శోభాయమానమై వెలుగొందే ఇంద్రకీల పర్వతాన్ని మరింత చక్కని యాత్రాస్థలంగా సకలసౌకర్యాలతో ఒప్పారేటట్లు చేయవలసియున్నది మహాప్రభూ!

మాధవ - మీరన్నట్లే అవశ్యం చేస్తాము. ఇంకా నిర్మించవలసిన ఆలయాలు అనేకం ఉన్నవి కదా! వాటికి నిపుణులైన శిల్పాచార్యుల కొరత ఉన్నది. అట్టివారి నన్వేషించండి మహామంత్రీ!

మహా - చిత్తం మహాప్రభూ!

ప్రతీహారి - (ప్రవేశించి) మహారాజా! ఎవరో అరేబియా వర్తకుడట. తమ దర్శనం కోరి వేచియున్నాడు.

మాధవ - ప్రవేశపెట్టు.

ప్రతీ - చిత్తం మహారాజా! (అని నిష్క్రమిస్తాడు)
(అరేబియా వర్తకుడు ప్రవేశిస్తాడు.)

అరేబియా - వర్తకుడు - సలాం సలాం మహారాజా సాహెబ్!

మాధవ - సలాం అట్లా కూర్చోండి. (అని ఆసనం చూపిస్తాడు)

అరేబియా - (కూర్చుంటాడు)

మహా - ఎక్కడి నుండి వస్తున్నారు సాహెబ్?

అరేబియా - నేను బొగ్దాద్ నుండి వస్తున్నాన్వండి. మాదీ అరబిస్తాన్. కానీ

ఎక్వా బొగ్దాద్‌లోనే బేపారం చేస్తూఉంటాం.

మహా - ఏమి వ్యాపారం చేస్తుంటారు?

అరేబియా - మాది గుఱ్ఱాలా బేపారం. హిందుస్తాన్ బర్మా సియాం వగైరా షానా దేశాలలో మాబేపారం నడుస్తుందివండి. ఈ దేశంలో ఖాస్కర్ చాళుక్యా చేరా మాళ్వారాజాలకు గుఱ్ఱాల్ అమ్మివస్తున్నాన్. మీకు మంచి గుఱ్ఱాల్ ఇచ్చి పోదామని వచ్చినాన్.

మాధవ - చాలాకాలం నుండి అరేబియా పారసీక దేశాల గుఱ్ఱాలను కొంటూ ఉన్నాము. మొన్న ఆరుమాసాల క్రిందటనే చాలావరకు కొన్నాము. ప్రస్తుతం అంతగా అవసరం లేదు.

అరేబియా- అజీ జరూరత్ ఎంతో అంతే ఖరీదు చేయవండి మహారాజ్! మీకి గుఱ్ఱాల ఫౌజ్ షానా షానా ఉన్నదని విన్నాన్. అవుర్ గుఱ్ఱాలంటే మీకి షానా షోక్ అనీ విని వచ్చినాన్. లడాయి గుఱాల్ కొన్ని తీసుకోండి ఫర్వ్వానహి. కాని ఖాస్కర్ సవారీ గుఱాల్ షానా మంచివీ ఉన్నాయ్, మీరు జరూర్ వాటికి ఖరీద్ చేయవండి.

మంచన - (కుతూహలంతో తండ్రి ముఖం చూస్తాడు.)

మహా - ఏమీ స్వారి గుఱ్ఱాలా? అవి కొన్ని అవసరం ఉన్నవి. చాలా మంచి లక్షణాలు గలవేనా!

అరేబియా- అజీ వాటికి వంకా ఏమిటివండి మంతరీ సాహెబ్! బెహతరీన్ గుఱ్ఱాల్. బిల్కుల్ తెల్లని గుఱ్ఱాల్. వాటి ఒఖ్కొ సుఖ్కొ అన్నీ అచ్చా లచ్చనాల్ ఉన్నాయి. అచ్చా ఖాసా మదించినయి. వీపు తాకితే చాలూ గాలికంటె మనసు కంటె జోరుగా దౌడు తీస్తాయి. ఇటువంటి గుఱ్ఱాల్ మీరు చూసి ఉండర్. వాటి ఖూబీ సవారీ చేస్తే తెలుస్తుంది కానీ ఇంతా అంతా నోటితో చెప్పరాదువండి. ఇంకా మీరే పరఖాయించి చూసుకోండి.

మహా - సరే పరీక్షిస్తాము. వాటి ఖరీదెంత?

అరేబియా- మీవంటి మహారాజాల్ తీస్కోవల్సినయ్. ఎక్వా తక్వా ఏమిటికి ఒక్క మాట చెప్తాన్, జోడీకి పదివేలా దీనార్లు వండి.

మాధవ - ఏమీ జతకు పదివేల దీనారాలా? ఏనుగులకు కూడ ఇంత వెల ఉండదే.

అరేబియా- అజీ ఏన్గుల్కి క్యాలగాయె మహారాజ్! ఇవి ఐసేవైసే గుఱ్ఱాల్ అనుకున్నార్ ఏమిటి? ఇవి అరబిస్తాన్‌లో నజద్ అనే మొకాంలో ఖాస్ కర్ పెంచాబడినయ్‌వండి. అటువంటి గుఱాల్ మీకి సారి దున్యాలో

 

ఎక్కడా దొరకయ్. మామూలి గుఱ్ఱాలకి పీటికి సుక్కల్‌కి చందా మామకి ఉన్న తేడా ఉంటుంది మహారాజ్!

మంచన - (తండ్రిపంక ఆసక్తితో చూచి) ఖరీదు చేయండి నాన్నగారు! మొన్న నాకు చేయించిన దివ్యరథానికి తగిన వాహనాలుగా ఈ ఉత్తమజాతి తురంగాలు ఉపయోగపడతాయి.

మహా - సాహెబూ! మీ గుఱ్ఱాలు ఎంతమంచివైనా ఇంత ఖరీదు యోగ్యం కాదు. సాధారణంగా మంచి గుఱ్ఱాలు ఐదువేల దీనారాలకు జత చొప్పున ఇస్తున్నారు కదా! ఈ జతను చివరికి ఆరువేలకైనా ఇవ్వవలసినది.

అరేబియా- మాషా అల్లా ఏమిమాట చెప్పినార్‌వండి మంతరీ సాహెబ్! చాళుక్యామాళ్వా రాజాలకు ఇచ్చిన ఖరిదే మీకూ చెప్పినాన్. ఎక్వా చెప్పి తక్వా చేసేది మాది తరీఖా కాదువండి. మాల్‌ను బట్టి ఖీమత్ అని మీకితెల్సు. మీకిజులుంలేదు మహారాజా. మాధవవర్మా సాహెబ్‌కి గుఱ్ఱాల్ అంటే షౌఖాయిష్ అనివచ్చినాన్. నకో అంటే ఇంకో రాజ్యానికి పోతాన్.

పురో - ఏమయ్యా సాహెబు! ఓపిక లేకుండా కోపానికి వస్తున్నావు. కొనుగోలు అన్నప్పుడు మాట్లావయత్నమూ ఉండనే ఉంటుంది. (అని రాజుతో) ప్రభూ! చిరంజీవి ముచ్చట తీర్చడానికైనా గుఱ్ఱాలను తీసుకోండి.

మంచన - తీసుకోండి నాన్నగారూ!

మహా - సరే మీరందరూ అన్నప్పుడు మేము కాదనగలమా? అట్లే తీసుకొందాము. (అని మంచనతో) నాయనా! తీసుకోగానే సరికాదు. మదించిన ఆ అశ్వాలను జాగ్రత్తగా ఉపయోగించవలె సుమా!

మంచన - అలాగే నాన్నగారూ!

అరేబియా- షుక్రియా రాజాసాహెబ్! మీకీ ఫాయిదా కావలె. మాకీ పేట దక్కాలె.

మహా - గుఱ్ఱాలను చూస్తామా సాహెబ్!

అరేబియా- అచ్ఛా చలియే చలియే (అని లేచును.)

(అందరూ లేవగా తెగపడును.)

# రెండవ రంగం

(స్థలం : అంతఃపురం. గదియెల్ల అలంకరించబడి యుంటుంది. మహా రాణి చంద్రావతీదేవి నిలువు టద్దం ముందు నిలిచి కేశాలంకరణాన్ని పుష్ప దామాన్ని సవరించుకొంటుండును )

(మాధవవర్మ ప్రవేశిస్తాడు.)

మాధవ - మహారాణిగారేదో మహాకార్యంలో నిమగ్నమై యున్నట్లున్నారే.
(అని తలనుండి కిరీటం తీసి రాణి కందిస్తాడు)

చంద్రావతీదేవి : (కిరీటం తీసుకొని బల్లపై ఉంచి మందహాసంతో)
మహారాజుగారి పాద సేవ కంటె మహాకార్యం నాకేముంటుంది ప్రభూ !

మాధవ : (నిలువు టద్దంలో నీడ చూచుకొని రాణి ప్రతిబింబం దానిలో చూచి రాణి మోమును అనురాగ దృష్టులతో చూచి).
ఓహో మహారాణిగారు నేడు చాలా మెరిసిపోతున్నారే. ఆహా! ఇది ముఖబింబమా ? లేక అమృతం అందించడానికి దివి నుండి భువికి దిగి వచ్చిన చంద్రబింబమా?

చంద్రా : (ఇంచుక సిగ్గుపడి) ఇదేమిటండీ మీరు నానాటికి పడుచువారై పోతున్నారు

మాధవ : నీవు మాత్రం కావటం లేదా చంద్రావతీదేవీ ! మధ్య వ య స్సు దాటినా వన్నె తరుగని నీ రూపరేఖా విలాసాలు చూస్తుంటే తొలి వయస్సులోని ఆ విలాస విభ్రమాలూ, ఆ ఉల్లాస సల్లాపాలూ జ్ఞప్తికి వచ్చి పడుచుతనంలో ఉన్నట్లే అనిపిస్తున్నది.
(అని ఆసనంపై కూర్చుంటాడు)

చంద్రా : (మరొక ఆసనంపై కూర్చుండి) బాగున్నది వరుస. విరామ మెరుగని రాజకార్యాలలో మునిగి తేలుతు అలసి సొలసి అంతఃపురానికి వచ్చే మీకు అహ్లాదమూ హాయీ కలిగించడానికి నేను రోజూ చేసే ప్రయత్నమే కదండి ఇది.

మాధవ - నన్ను సంతోషపెట్టే దానివి నీ వొక్కతెవేనా ఏమి? నీవుకాక నాకు మరొక ప్రియరాణి ఉన్నదని నీకిన్నాళ్ళకూ తెలియలేదా? ఆమె కౌగిటిలో హాయిగా ప్రొద్దుగడపి వచ్చేనాకు అలసట ఏమిటి?

చంద్రా - (కొంత అప్రియంతో) ఇదేమి వేళాకోళమండీ?

మాధవ - వేళాకోళం కాదుదేవీ! నిజం.

చంద్రా - (కోపంతో) నిజమా? ఐతేకావచ్చు. మహారాజులు మీ కెదు రేమిటి? అయినా ఒకరిద్ద రేమిటి? వందమంది రాణులతో కులుకవచ్చు. (అని ఈర్ష్యతో) యింతకూ ఆ ప్రియరాణి ఎవరో సెలవిస్తే ఇన్నాళ్ళకైనా తెలిసి సంతోషిస్తాను.

మాధవ - మహారాణిగారికి కోపంవచ్చినట్లుందే. సరే ప్రియమైనా అప్రియమైనా చెప్పక తప్పదు. నన్ను దినమెల్లా తన వెచ్చని కౌగిలిలో సుఖపెట్టే ఆ ప్రియురాలెవ్వరో చెప్పనా? చెప్పనా? ఆమె రాజ్యలక్ష్మి ఈ భూకాంత చంద్రా!

చందా - (నవ్వి) రాజ్యలక్ష్మియా? భళేవారండి. క్షణకాలం నన్నెంత కళవళ పెట్టినారు. వయస్సు పెరిగినకొలది మీకు పరిహాస వినోదాలు పెరిగిపోతున్నవి.

మాధవ - శరీరం వృద్ధాప్యానికి సాగినకొలది మనస్సు యౌవనానికి దారి తీస్తుందంటారు.

చంద్రా - ఆ లాగున మీరు యువకులైపోతున్నారన్నమాట. సరే కాని నాకొక సందేహం. అడుగుమంటారా?

మాధవ - నిస్సందేహంగా.

చంద్రా - మీకు యిద్దరు రాణులు కదా! ఏ రాణి ఎక్కువ ప్రియమైనదో సెలవిస్తారా?

మాధవ - ఓహో పెద్ద చిక్కే వచ్చి పడినదే. ఈ ఆడవాళ్ళతో ఇదేపేచి సవతి ఈర్ష్య ఆడవాళ్ళకు వాళ్ళు పుట్టకముందే పుట్టినదట.

చంద్రా - పుట్టితే పుట్టినది. ఆడవాళ్ళ స్వభావ విమర్శ మీ మగవాళ్ళకెందుకు గాని ముందు నా ప్రశ్నకు సమాధానం చెప్పండి.

మాధవ - అదే చెప్పబోతున్నాను. నాకు మహారాణికంటే రాజ్యలక్ష్మి ఎక్కువ ప్రియమైనది. అట్లే రాజ్యలక్ష్మికంటె మహారాణి ఎక్కువ ప్రియమైనది.

చంద్రా - ఇదేమి సమాధానమండి ?

మాధవ - అర్థంకాలేదా జీవితేశ్వరీ! నేను నిన్నెంత ప్రేమిస్తున్నానో ఈ రాజ్యలక్ష్మిని అంతే ప్రేమిస్తున్నాను. నీవు నా జీవితంలో అమృతం పోసి నన్ను స్వర్గసీమల విహరింపజేస్తావు. రాజకార్యాలు కూడా నన్నెంతగానో ఆకర్షించి అలరించి అమరునిచేస్తాయి

చంద్రా - ఓహో! ప్రభువులు దక్షిణనాయకులన్నమాట. ఐనా రాజ్యలక్ష్మి బాహుబంధాలలో చిక్కుకొని మీ ఈ తొలి రాణిని, ఈ అంతఃపురాన్ని ఎక్కడ మరచిపోతారో అని విచారం.

మాధవ - ప్రాణప్రియా! ఈ విచారందేనికి నీవు నా ప్రాణానికి ప్రాణమవు నా యెదలోని యెదవు. నిన్ను విడిచి నేనుమాత్రం నిలువగలనా? (అని దగ్గరకు తీసుకొని లాలిస్తాడు.)

చంద్రా - మీ సన్నిధిలో నాకు యుగమొక క్షణంగా గడచిపోతుంది. అలాగే మీరు దూరాన ఉన్నప్పుడు క్షణమొక యుగంగా తోస్తుంది. అంతఃపురాన ఉండికూడా మీరు మధ్య మధ్య రాజకార్య పరధ్యానం చిత్తగిస్తూ ఉంటారు. మీ నిష్ఠుర రాజధర్మ నిర్వహణచూస్తే నాకెందుకో దిగులౌతుంది ప్రభూ!

మాధవ - దిగులెందుకు రాణీ! ఒక పరిపాలకునిగా నేను రాజధర్మాన్ని చక్కగా ఆచరించవలసినదే కదా! నేను ఏ రాజకార్యాలలోవున్నా నిన్నూ అంతఃపురాన్నీ మరచిపోలేను. కాగా సుక్షత్రియుడు వ్యక్తి విషయానికంటె రాష్ట్రవిషయానికి, స్వీయలాభంకంటె ప్రజాక్షే

మానికి ప్రథమ ప్రాధాన్యం ఇవ్వవలెనన్న రాజధర్మం మహా కోసల రాజపుత్రి వైన నీకు తెలియనిదికాదు.

చంద్రా - నాకు తెలియదని కాదు. కాని ఈ వయస్సులో కూడ నిర్విరామంగా రాజకార్య భారనిమగ్నులవుతుండడం చూచి బాధపడుతున్నాను ప్రభూ! చిరంజీవి మనచన్నను త్వరగా సుశిక్షితుని జేసి చాలవరకు రాజ్యభారం వహింపజేస్తే మీకెంతో విశ్రాంతిగా శాంతిగా ఉండ గలదు. (అని వత్సలరసం గల పాత్ర నందిస్తుంది)

మాధవ - (త్రాగుతు) నేను కూడ చిరంజీవి విషయం ప్రత్యేక శ్రద్ధ వహిస్తున్నాను. కుమారుడు కూడ నానాటికి పెద్దల రాజనీతి శిక్షణలో సానబట్టిన రత్నం వలె ప్రకాశిస్తున్నాడు.

చంద్రా - కానక కన్న సంతానం. చిరకాలం జప తపాలు వ్రతాలు అనేకం చేసి ఆ దుర్గామల్లేశ్వరుని ప్రసాదం వల్ల కన్న ఏకైకపుత్రుడు. అబ్బాయికి యుక్తవయస్సు వచ్చినది. ఎందరో రాజకుమారికల చిత్రపటాలు వివాహం కోరి వస్తున్నవి. కన్నుల కరువుదీర చిరంజీవి శుభకల్యాణం చూడవలెనని యున్నది. మీరేమో ఈ విషయం అంతగా శ్రద్ధపెట్టరు.

మాధవ - సంబంధం నచ్చవలసినది మెచ్చవలసినది వివాహం చేసుకొనేవారు. చిరంజీవియే పెండ్లికి అంతగా ఆసక్తి చూపడంలేదు. అతనికొక రాజకుమారి ఇష్టమైతే మరుక్షణమే వివాహం చేయడంలో మనకెట్టి అభ్యంతరమూ ఉండరాదు. ఈ విషయం చిరంజీవి నడగి తెలుసు కోవడం అవసరం. చిరంజీవిని పిలిపిస్తామా?

చంద్రా - అలాగే చిరంజీవిని అడిగి తెలుసుకొనండి. ఐతే అబ్బాయి ఇంతకు ముందే వచ్చి వెళ్ళినాడు. మొన్న మీరేవో మంచి గుఱ్ఱాలను కొని ఇచ్చినారట. వాటిని పూన్చిన రథంలో వాహ్యాళికి బయలుదేరి వెళ్ళుతానన్నాడు.

మాధవ - తొందరపడి ఇప్పుడే వెళ్ళడమా?

చంద్రా - తొందరేమిటండి. ఏదో క్రొత్త గుఱ్ఱాలను కొన్న సంతోషం. వినోదంగా విహరించి రానీయండి.

మాధవ - అది కాదు దేవీ! కొన్నవి మదించిన గుఱ్ఱాలు. మచ్చికకానివి. అబ్బాయికి కష్టమవునో ఏమో. నాలుగు నాళ్ళు అభ్యాసమైన పిదప విహారానికి పూనుకుంటే బాగుండేది.
(అంతలో పురోహితుడు ప్రవేశిస్తాడు)

మాధవ - రండి రండి శర్మగారూ! కూర్చుండండి (అని ఆసనం చూపుతాడు)

చంద్రా - పూజ్యులగు నాయనగారికి అభివందనాలు.

పురో - (కూర్చుండి) దీర్ఘసుమంగళీభవ! అభ్యుదయపరంపరా ప్రాప్తిరస్తు! ఇష్టకార్య సిద్ధిరస్తు! (అని రాణిని దీవించి) ఏదో మాట్లాడు కొంటున్నట్లున్నారు. నా రాక మీ సంభాషణకు అంతరాయం కలిగించెనేమో.

మాధవ - మీరు మా వంశబ్రాహ్మణులు. పురోహితులు, హితులు. మీకు అంతఃపురం వేరు కాదుకదా!

చంద్రా - చిరంజీవి మంచన్న వివాహం గురించి మాట్లాడుకొంటున్నాము.

పురో - శుభం. యువరాజు కల్యాణమంటే అందరికీ పండుగే. అందులో మావంటి వారికి కలిగే ఆనందానికి అంతే ఉండదు. (అని కొంత ఆలోచన నటించి వేళ్ళు లెక్కించి) కాని....

చంద్రా - కాని ఏమిటి నాయనగారూ!

పురో - ఏమీలేదు తల్లీ! యువరాజు వివాహానికి ఈ సంవత్సరం బలంలేదు. అంతే.

చంద్రా - ఐతే ఒక సంవత్సరం వేచియుండవలెనన్నమాట.

పురో - సంవత్సరమెందుకు? వచ్చే కార్తిక మాసంనాటికి అన్ని విధాలా గ్రహబలం ఉంటుంది.

మాధవ - సంబంధం చూచుకొని నిశ్చయించుకొనే సరికి ఈ కొన్ని నెలలు కడచిపోవును.

పురో - అప్పటికి అన్నీ కలిసి వస్తాయి. కాగా ఈ కొంతకాలం చిరంజీవికి గ్రహచారం బాగుగాలేదని అశుభం సూచిస్తున్నదని నేనింతకు కొన్నాళ్ళ క్రిందట చెప్పియుంటిని. ఆ అరిష్టం తొలగడానికి జప హోమాదులు నిర్వర్తించితిమి అంతా శుభం కాగలదు.

చంద్రా - పెద్దల ఆశీర్వచనం, ఆ దుర్గామల్లేశ్వరస్వామి అనుగ్రహం తో దై చిరంజీవిని సర్వదా చల్లగా కాపాడునని యే నిండు విశ్వాసం.

పురో - ప్రతిమాసం ఆచరించే శ్రీ దుర్గాదేవీ వ్రతం నిర్విఘ్నంగా సాగుతున్నదా తల్లీ!

చంద్రా - తమ ఆశీర్వచనం వల్ల చక్కగానే సాగుతున్నది. ఈ మాసవ్రతం నిన్ననే ముగిసినది.

పురో - మహారాజా! ఒక్క విషయం మనవి చేస్తామని వచ్చినాను.

మాధవ - (పరధ్యానంలో ఏదో ఆలోచనా మగ్నుడై యుండును)

చంద్రా - ఏమండీ మిమ్ములనే. మరేమి రాజకార్య విచారం చేస్తున్నారు?

మాధవ - (తేరుకొని) ఆ, ఏమీలేదు. ఏమిటి దేవీ!

చంద్రా - నాయనగారు మీకేదో చెప్పుతున్నారు ప్రభూ!

మాధవ - ఏమిటి శర్మగారూ! చెప్పండి.

పురో - వసంతఋతువు సమీపిస్తున్నది. అగ్నిష్టోమ యాగాలకు ఏర్పాటు చేయుమంటారా ప్రభూ!

మాధవ - బాగా జ్ఞాపకం చేసినారు. ఈ వసంతానికి కనీసం పది అగ్నిష్టోమాలైనా నిర్వర్తిస్తాము. వాటి కవసరమయ్యే ఏర్పాట్లు అన్నీ చక్కగా చేయించండి.

పురో - చిత్తం మహారాజా! అలాగే అన్ని ఏర్పాట్లు చేయిస్తాను.

మాధవ - మరొక విషయం. ఇప్పటికి మనము తొమ్మిది అశ్వమేధ యాగాలు పూర్తి చేసినాము. ఇంకా రెండు చేసే జీవితం చరితార్థం అవుతుంది.

పురో . ఈ విషయం పూజ్యశ్రీ రాజగురువులు గారితో ఆలోచించి పదవ అశ్వమేధానికి పూనుకొందాము ప్రభూ!

మాధవ . అట్లే శర్మగారూ!

ప్రతీహారి. (ప్రవేశించి) మహారాజా! నర్తకి తమ కొలువుకు సిద్ధంగా ఉన్నది.

మాధవ . ప్రవేశ పెట్టు.

ప్రతీ . చిత్తం మహారాజా. (అని నిష్క్రమిస్తాడు)

(రాజనర్తకి ప్రవేశించి రాజదంపతులకు నమస్కరించి నృత్యం చేస్తు పాడుతుంది)

నర్తకి . నృత్య గీతం:.

నమో నమో మల్లేశ్వరా!
నమో నమో విశ్వేశ్వరా!
ఉమామనోహర! రమాపతీశ్వర!
హిమాంశు శేఖర! ప్రభూంధ భాస్కర! ॥నమో॥
కాలుని శిక్షించి ముని బాలుని రక్షించి
మేలని సురలు నుతించ భువ! నాల నేలెదవుమించ ॥నమో॥

త్రిపురాసురులను ద్రుంచి! త్రిజగముల నుద్ధరించి
విపుల గంగ ధరియించి! వెలసినావు దయ లుంచి ॥నమో॥
హాలాహలము పానముచేసి! అమృతరసము పంచగజేసి
ఇలాతలములో శంకరుండవై! చెలగెదు భక్తవశంకరుండవై ॥నమో॥
మహాదేవ! శంభో! దుర్గామల్లేశ్వర! వరదా! భర్గా!
ఇహపర సుఖసంధాయకా! హే సర్వ జగన్నాయకా! ॥నమో॥

(అంతలో నేపథ్యం నుండి ఘంటారావం ఎడ తెగకుండ వినవస్తుంది. మాధవవర్మ సంభ్రమంగా లేచి ముందుకు సాగుతాడు. మహారాణి, పురోహితుడు ఉలికి పడి లేచి నిలుచుంటారు. నర్తకి నిష్క్రమిస్తుంది.)

మాధవ : ఎవరో మొగసాలలో దరమంట మోగిసునారు. ఎవరికి ఏ ఆపద

వచ్చినదో. (అని ముందుకు అడుగు వేస్తాడు. పురోహితుడు అనుస రిస్తాడు. రాణి నిష్క్రమిస్తుంది. అంతలో ఒక పేద ముసలిది తన కొడుకు శవాన్ని మోసుకొని ఏడుస్తూ ప్రవేశిస్తుంది.)

పేదముసలిది - రచ్చించండి పెబో రచ్చించండి (అని శవాన్ని రాజు పాదాల వద్ద పడవేసి ఏడుస్తుంది).

మాధవ - ఎవరమ్మా నీవు ? ఏమి జరిగినది ? ఈ యువకునికి ఏమైనది ?

పేద - చంపేశారు పెబూ నా కొడుకును చంపేశారు ఏం చెప్పను. నేను సింతకాయలు అమ్ముకొని పొట్టపోసుకొనే పేదరాలిని. ఈడు నాకు ఒక్కగాని ఒక్క కొడుకు. ఈదిలో సింతకాయలు అమ్ముకొంటుంటే ఏదో రానోరి రదం యాగంగా ఒచ్చి పైనుంచి పోయి నాకొడుకును పొట్టన పెట్టుకున్నది పెబో పొట్టన పెట్టుకున్నది. నేను అనాథను కొడుకు మీద ఆశెట్టుకొని ఈ పెద్దతనాన బతుకు ఈడుస్తూన్నా. ముసలిదాన్ని నేనేమైనా సరే. రేపో మాపో పోయేదాన్ని. కానీ ... మొన్ననే పెండ్లాడిన పడుసు కోడలు గతి యేంగాను పెబో కోడలు గతి ఏంగాను ? సిరి ఉన్న మారాజులు హాయిగా తినాలి. కట్టాలి. తప్పుచేస్తే ఇశారించి సిచ్చించాలి. కాని ఇట్లా దిక్కుమాలిన బడు గోళ్ళపైన రదాలు తోలి ప్యానాలు తీతారా పెబో ప్యానాలు తీత్తారా? దరుమ పెబులు మీరు. ఇట్టాంటి గోరం జరిగిపోయింది. ఇశారించి నాయం సేయండి పెబూ ! (అని కొడుకు నుద్దేశించి) అయ్యో కొడుకా ! నాకింక దిక్కేది ? అప్పుడే నూరేండ్లు నిండి పోయావా తండ్రీ ! అయ్యో ! నిన్ను విడిచి మేమెట్టా బతుకగలము కొడుకా ! (అని వలవల ఏడుస్తుండును).

పురో - శివశివా ! ఎంత ఘోరం జరిగిపోయింది.

మాధవ - (దుఃఖావేశంచేత కారే కన్నీటి బిందువులను తుడుచుకొని) ఏడవకు తల్లీ ! ఏడువకు నీ కొడుకు చావుకు కారకుడైనవాడు ఎవడో వెంటనే విచారించి ఆ దుర్మార్గునికి కఠిన శిక్ష విధిస్తాము. మీ కుటుంబ జీవనానికి తగిన ఆధారం కల్పిస్తాము. ఇకముందు

ఈలాంటి నేరాలు ఘోరాలు జరుగకుండ మరింత కట్టుదిట్టాలు చేయిస్తాము. మాకు మాకుమారుడెంతో నీ కుమారుడు అంతే. ఎంత శోకించినా పోయిన కొడుకు తిరిగిరాడు. కర్తవ్యం నెరవేరుస్తాము. ఊరడిల్లుమమ్మా ఊరడిల్లు (అని ప్రతీహారిని పిలుస్తాడు. ప్రతీహారి ప్రవేశిస్తాడు). ప్రతీహారీ ! ఈ యవ్వను తోడుకొని పోయి తగిన ఉపచారాలు చేయించు. వెంటనే రక్షక భటాధికారిని పిలువు.

ప్రతీహారి : మహా చిత్తం ప్రభూ !

పేదముసలిది : అయ్యో. కొడుకా ! కొడుకా ! (అని శోకిస్తూ శవంపై పడిపోతుంది) (తెరపడుతుంది).

# మూడవ రంగం

(స్థలం : మాధవవర్మ ఆస్థానం. మాధవ వర్మ ధర్మాసనం మీద ఆసీనుడై ఉంటాడు. మహామంత్రి, పురోహితుడు, ధర్మాధికారి, ప్రాడ్వివాకుడు, ఆసనాలపై కూర్చుండియుంటారు. నిందితుడు యువరాజు నిలబడియుంటాడు. పేదముసలిది క్రింద కూర్చుండి యుంటుంది)

మాధవ - ధర్మాధికారీ! న్యాయవిచారణ ప్రారంభించండి.

ధర్మాధికారి - చిత్తం ప్రభూ! (అని ప్రాడ్వివాకునితో) ప్రాడ్వివాకా! అభియోగం వినిపించు.

ప్రాడ్వివాకుడు - చిత్తం (అని అభియోగపత్రం చదువుతాడు)

ప్రాజ్ఞ సభాసదులారా! మన విజయవాటికా నగరంలో ఘోర ప్రమాదం ఒకటి జరిగినది. అది మన రాష్ట్రమంతటికీ అత్యంత దురదృష్టకరమైనది. నిన్న సాయం సమయంలో పెద్ద అంగడి వీథిలో ప్రక్కన ఒక పేద ముసలమ్మ తన కొడుకుతో చింత కాయలు అమ్ముకొంటుండగా రాచవారి రథం ఒకటి మహావేగంగా వీథి నుండి వచ్చి ఆమె కొడుకు మీది నుండి పోగా ఆ యువకుడు తత్‌క్షణమే మరణించినాడు. ఆమె శ్రీ మన్మహారాజుగారితో మొర పెట్టుకొన్నది. రక్షకభటాధికారి వెంటనే ప్రమాదస్థలానికి భటులతో తరలివెళ్ళి పరిశీలించి పరిశోధన చేసినాడు. అతని నివేదిక లోని అభియోగ సారాంశం ఏమనగా నిన్న సాయంకాలం నగరం లోని ఆ వీథిగుండా రాచవారి రథమొక్కటే పోయినది. అది ఎవరిదో కాదు. సాక్షాత్తు యువరాజు మంచన భట్టారకులుగారిదే. వారి రథచక్రానికి నెత్తుటి మరకలు కనిపించినవి. ఈ దుస్సంఘటన మరణించిన యువకుని అజాగ్రత్త వల్లనే జరిగినదని తెలియవచ్చినది. ధర్మాధికారులీ విషయమెల్లా విచారించి తగిన న్యాయం చేయగలరని విన్నవిస్తున్నాను.

ధర్మా . ఈ అభియోగం విషయంలో వాదియైన పేదముసలమ్మ పుల్లమ్మ వాఙ్మూలం కావలెను.

ప్రాడ్వి - పుల్లమ్మా! అభియోగం విన్నావు కదా! ఈ విషయంలో నీవేమి చెప్పకొందువో సత్యప్రమాణంగా చెప్పు.

పుల్లమ్మ- మా ఇంటి దేముడు మల్లన్న సాచ్చిగా పెమానం చేసి సత్తెం సెప్పతున్నా. నిన్న సందెయేలకు జాము పొద్దు ఉండంగ నా కొడుకుతో సింతకాయలు అమ్మటానికి అంగడి ఈదికి పోయి ఈది పక్కన కూసున్నా. సింతకాయలు మోసుకొచ్చిన నా కొడుకు ఆటిని కుమ్మరించి నాకు ఎదురుగా కూసుండి సింతకాయలను కుప్పలు పెడుతున్నాడు. ఆ అంగడి ఈది అంతా జనంతో నిండి ఉన్నది. అంతలోనే రాసోరి రదం పెద్ద సప్పుడుతో యాగంగ వొచ్చింది. బంటులు ఎచ్చరికలు సేత్తుండిరి. నా కొడుకు ఎంటనే పక్కకు తప్పకోబోయినాడు. ఆడు పూర్తిగా తప్పకోక ముందే ఆడి మీది నుండి రదం పోయింది. అంతా కన్నుమూసి తెరిసే అంతలోనే అయిపోయింది. కొడుకు నెత్తురు మడుగులో కొట్టుకొని ప్యానాలు ఒదిలాడు. ఇందులో నా కొడుకు తప్పేమీలేదు. గోరంగా రదమే మీది నుండి పోయి నా ఒక్కగాని ఒక్కకొడుకును మింగేసింది. దిక్కుమాలిన దాన్ని. నా గతి ఏమైనా నా కోడలి గతి ఏంగాను. దరుమపెబులు. ఇచారించి నాయం సేయండి.

ధర్మాధి - వాది పక్షానగల సాక్షులను విచారించవలెను.

ప్రాడ్వి - పుల్లమ్మా! యువరాజులుంగారి రథం నీ కొడుకు మీది నుండిపోయినప్పుడు చూచిన సాక్షులెవరైనా ఉన్నారా?

పుల్లమ్మ - ఆ గోరం జరిగిన చోట ఉన్న జనమంతా సూసే ఉన్నారు. కాని ఈ పేదరాలికి సాచ్చం ఎవరు పలుకుతారు. నాకు సాచ్చు లెవరూ లేరు. ఆ ఒక్క దేవుడే సాచ్చి.

ధర్మా - సరే నీవు కూర్చుండమ్మా! (అని ఏమో వ్రాసుకొని ఇక నిందితుని వాఙ్మూలం కావలెను.

ప్రాడ్వి - యువరాజా ! మంచనభట్టారకా ! నీపై వచ్చిన అభియోగం గురించి ప్రమాణం చేసి సత్యం చెప్పు.

మంచన - మా ఇలవేల్పు శ్రీ దుర్గా మల్లేశ్వరునిపై ప్రమాణంచేసి సత్యం చెబుతున్నాను. నిన్న సాయంకాలం నాలుగు జాముల వేళకు మొన్న కొన్న అరేబియా గుఱ్ఱాలను పూన్చిన రథమెక్కి నగర సమీపారణ్యానికి వినోదంగా వాహ్యాళికి బయలుదేరి వెళ్ళితిని. ఉత్సాహంతో రథం నేనే నడిపినాను. నగర వీథుల నుండి రథం సాగిపోయింది. జన సమ్మర్థం గల ఘంటాపథాలలో భటులు హెచ్చరికలుచేస్తూ జనులను ప్రక్కలకు ఒత్తుతుండిరి. రథం అడ్డులేకుండా వేగంగా వీథులను గడచిపోయినది. ఆ అంగడి వీథిలో ఈ దుస్సంఘటన జరిగిన విషయం నాకే మాత్రం తెలియదు. నిన్న రాత్రి రక్షక భటాధికారి వచ్చి తెలిపే వరకు నాకీ ఉదంతమే తెలియరాలేదు. తెలియకుండ సంభవించిన ఈ ఘోర ప్రమాదానికి చాలా చింతిస్తున్నాను. ధర్మాధికారులు ఈ విషయం విచారించి తగిన న్యాయం చేయగలరని మనవి చేస్తున్నాను.

ధర్మా - నిందితుని సాక్షులను విచారించవలెను.

ప్రాడ్వి - యువరాజా ! ఈ దుస్సంఘటన మృతి చెందిన యువకునిఅజాగ్రత్త వల్లనే జరిగినదని చెప్పడానికి నీకు సాక్షులెవరైనా కలరా?

మంచన - ఈ విషయం ఇట్టెనదనితెలిస్తేకదా నేను సాక్షులను గురించి ఆలోచించేది. నాకు సాక్షు లెవ్వరూ లేరు. సర్వాంతర్యామియైన దుర్గా మల్లేశ్వరుడే సాక్షి.

ప్రాడ్వి - మంచిది ఈ ప్రమాదం జరగడానికి ఆ యువకుని అజాగ్రత్తయే కారణమని నీవేమైనా చెప్పగలవా ?

మంచన - నాకీ ప్రమాద విషయం ఏమాత్రం తెలియదని విన్నవించితిని కనుక యువకుని అజాగ్రత్త గురించి నేనేమీ చెప్పలేను.

ప్రాడ్వి - యువరాజా ! నీవు నిర్దోషివని చెప్పకొనడానికి నీవద్ద ఇంకేమైనా నిరూపణ ఉన్నదా?

మంచన - ఈ విషయంలో దోషి ఎవరో నిర్దోషి యెవరో చెప్పడానికి కూడా నావద్ద ఏలాంటి నిరూపణలేదు. ధర్మాధికారులు ధర్మన్యాయాలను విచారించి ధర్మాసనం ఏ తీర్పు నెలవిచ్చినా శిరసావహిస్తాను.

ప్రాడ్వి - సరే అభియోగ విషయంలో వాదిప్రతివాదుల వాఙ్మూలాలు సాక్ష్యాది విచారణలూ ముగిసినవి. ఇక విషయమంతా పరిశీలించి న్యాయాన్యాయాలు నిర్ధారించి ఒక పేద యువకుని ఘోర మరణానికి కారకులైనవారికి కఠిన శిక్ష విధించగలరని ధర్మాధికారులను కోరుతున్నాను.

ధర్మాధి - (ఏదో వ్రాసుకొని కొంతసేపు ఆలోచించి) గౌరవనీయులగు సభాసదులారా! పుల్లమ్మ కొడుకు మరణానికి దారి తీసిన దుస్సంఘటన గురించిన అభియోగాన్ని దాని విచారణను సాంతం విన్నారు. రక్షక భటాధికారి అభియోగ సారాంశాన్ని బట్టియు వాది వాఙ్మూలాన్ని బట్టియు యువరాజు మంచన భట్టారకులుగారి రథం పై నుండి పోవడం వల్లనే ఆ యువకుడు మరణించినట్లు తేటపడుతున్నది. కాగా యువకుడు కేవలం వీధి ప్రక్కన ఉండగా యువరాజుగారే తప్పుగా రథాన్ని వానిపై తోలి వాని చావుకు కారకులైనారనడానికి ప్రత్యక్ష సాక్ష్యాధారమేమీలేదు. కనుక నిందితుడైన యువరాజు నిర్దోషి అని నేనభిప్రాయపడుతున్నాను. నా యీ అభిప్రాయంతో సభాసదులు ఏకీభవించగలరనియు శ్రీ మన్మహారాజు గారి విషయం చిత్తగించి తుది నిర్ణయం చేసి తీర్పు నెలవీయగలరనియు మనవి చేస్తున్నాను.

పుల్లమ్మ - (లేచి) ఐతే నా కొడుకునెవరు చంపారు? నాకు దిక్కెవ్వరు పెట్టా!

ప్రాడ్వి - అమ్మా! నీవిప్పుడేమీ మాట్లాడరాదు. కూర్చుండు.

పుల్లమ్మ - (ఏడుస్తు కూర్చుంటుంది)

మహా - ధర్మాధికారి అభిప్రాయం న్యాయసమ్మతమని నేను భావిస్తున్నాను.

పుర. - ధర్మాధికారి అభిప్రాయంతో నేనేకీభవిస్తున్నాను.

(తెరలో నుండి 'ధర్మాధికారిగారి అభిప్రాయం సరియైనదని మా పౌరుల అభిప్రాయం' అని వినవచ్చును)

మాధవ - (గాంభీర ముద్రదాల్చి సర్వం వినుచుండినవాడు ఇంచుక తలఊపి) ప్రాజ్ఞ సభాసదులారా! నేడు మనం అతిక్లిష్టమైన అభియోగం గురించి విచారం చేస్తున్నాము. ధర్మాధికారియు సభ సదులంతరూనూ మాపైనా యువరాజుపైనా ఉన్న గౌరవాభిమానాల చేత ఈ విషయంలో పక్షపాతం చూపుతున్నారనియే మా అభిప్రాయం. దుస్సంఘటన జరిగినప్పుడు చూచిన పౌరులెవ్వరూ యువరాజని భయపడి సత్యవిషయం సాక్ష్యం చెప్పడానికి ముందుకురారు. ప్రత్యక్షసాక్ష్యాధారం లేనంత మాత్రాన అపరాధం దాగదు. సకల సాక్షియైన ధర్మదేవత కన్నులెవ్వరూ కప్పజాలరు. కాగా యువరాజే తప్పుగా రథంతోలి పేద యువకుని మృతికి కారకుడనడాన్కి ఆధారమేమియని మీరడుగవచ్చు. ఈ దుర్ఘటన జరిగిన విషయం తనకే మాత్రం తెలియదని నిందితుడే ఒప్పుకొన్నాడు. అంటే నగర వీధులనుండి రథం తోలుతు వీథిలో ఎవరున్నదీ ఏమున్నదీ గమనించక అజాగ్రత్తగా స్వారీచేసినాడన్న మాట. ఈ విధంగా అవధానం లేకపోవడంవల్ల ప్రమాదం సంభవించియుండును. రాజ వీథిలో ఇలాంటి దుర్ఘటన జరిగినా తెలుసుకోజాలక పోయినాడనగా గుఱ్ఱాలు మహావేగంగా రథాన్ని ఈడ్చుకొనీ పోయియుండును. జనసమ్మర్దం గల ఘంటాపథాలలో భటులు హెచ్చరికలు చేస్తు జనులను ప్రక్కల కొత్తుచుండగా రథం అడ్డులేకుండా వేగంగా వీథులను గడచిపోయినదని నిందితుడే తెలిపినాడు. రథానికి పూన్చిన గుఱ్ఱాలు మహావేగవంతాలేకాక బాగా మదించివవి. మచ్చిక పడనివి. అలాంటి రథంలో స్వారి చేసినవాడు వీథిలో ఉన్న యువకుని గమనించలేకపోవడమేకాక ఆ యువకుడు ప్రక్కకు తప్పుకొనే లోపలనే అదుపు తప్పి త్వరితంగా వానిపై నుండి రథం పోయి వాడు ప్రమాదానికి గురియై పడిపోయినా ఇసు

హంతయైనా తెలుసుకోలేకపోయినాడని నిరూపితమవుతున్నది.
నగరమన్నపుడు వీథులలో బాలురుంటారు. వృద్ధులుంటారు. కుంటి
వారుంటారు. గ్రుడ్డివారుంటారు. అలాంటి జనసమ్మర్దంగల నగర
వీథులలో మదపు గుఱ్ఱాలను పూన్చిన రథమెక్కి స్వారి చేయరాదు.
అలా అక్రమంగా స్వారి చేసి దోషియవుటయేగాక ఒక పేద
యువకుని నిండుప్రాణాలను బలిగొని మహాపరాధం చేసినాడు.
ఈ నిందితుడు నిర్దోషికాడు. అందుచేత ధర్మాధికారీ! ఈ దోషికి
శిక్షాస్మృతి ననుసరించి యెట్టి శిక్షవేయదగునో చెప్పండి.
(అనగానే అందరూ దిగ్భ్రాంతి చెంది బాధపడుతుంటారు)

ధర్మాధికారి. మహారాజా! ఒకరి మరణానికి కారకుడైన దోషికి మరణదండన
విధించవలెనని శిక్షాస్మృతి తెలుపుతున్నది.

మాధవ. ఔను అదే సరియైన శిక్ష. హంతకుడైన ఈ దోషికి మరణదండన
విధిస్తాము.

(తెరలో మా యువరాజుకు మరణదండన విధించవద్దు. మరణ
దండన విధించవద్దు అని పౌరుల కేకలు వినబడతాయి)

పురో - (ఆవేదనతో) మహాప్రభో! ఆ హంతకుడు ఎవరోకాదు. సాక్షాత్తు
తమ పుత్రరత్నం. మన యువరాజు. ఈ ఘోరశిక్ష విధించవద్దు.
క్షమాభిక్ష పెట్టండి.

మాధవ. ధర్మానికి తనవారు పరాయివారన్న భేదంలేదు. న్యాయానికి యువ
రాజని సామాన్యుడని వ్యత్యాసంలేదు. చట్టానికి అందరూసమానమే.
ఈ నిందితునికి శిక్ష పడవలసినదే.

మహా - మహారాజా! ఒక్కమనవి. చిత్తగించండి. నిందితుడైన మంచన
భట్టారకుడు తమరికి వంశోద్ధారకుడైన సుపుత్రుడేకాక మాకు, ఈ
సువిశాల రాజ్యానికి యువరాజు. మహావీరుడు. ధర్మశాస్త్రం, రాజ
నీతి, అర్థశాస్త్రం మున్నగు అనేక విద్యలలో ప్రాజ్ఞుడు. యువ
రాజుగా అనేక యుద్ధాలలో పాల్గొని విజయాలు సమకూర్చి రాజ
కార్యాలలో సహకరించి ప్రజాసేవ చేస్తున్నవాడు. కాబోయే మహా

రాజు. రాజ్యభారం వహించడానికి సర్వవిధాల యోగ్యుడూ సమర్థుడు. ఇలాంటి మహాప్రముఖవ్యక్తిని కాపాడుకోవలసిన అవసరం ఎంతైనా ఉన్నది. ఈ సందర్భంలో మరొక విన్నపం. 'ప్రమాదోధీమతామపి' అన్న ఆర్యోక్తి ననుసరించి ఎంతటి బుద్ధి మంతులకైనా ఒక్కొక్కప్పుడు ప్రమాదం జరుగవచ్చును. ఈ యువరాజు బుద్ధిపూర్వకంగా పేదయువకునిపై రథం తోలలేదు. ప్రమాదవశాత్తున ఘోరం జరిగిపోయినది ఇలాంటి దోషులకు శిక్ష తగ్గించవచ్చుననియు, పరిస్థితులను బట్టి ప్రజలకు అత్యవసర మయ్యే ప్రముఖ వ్యక్తులకు క్షమాభిక్ష పెట్టవచ్చుననియూ ధర్మ శాస్త్రం చెబుతున్నది. కావున సర్వాధికారులూ, ధర్మన్యాయశాస్త్ర నిపుణులూ దయామయులూ ఐన తాము ఈ విషయాలన్నీ చిత్తగించి యువరాజు గారికి క్షమాభిక్ష పెట్టవలెనని అందరి పక్షాన ప్రార్థిస్తున్నాను.

(తెరలో 'యువరాజు గారిని శిక్షించవద్దు. యువరాజు గారిని శిక్షించ వద్దు. క్షమాభిక్ష పెట్టాలి క్షమాభిక్ష పెట్టాలి, యువరాజు మంచన భట్టారకుల వారికి జయ' అని కేకలు వినిపిస్తాయి)

మాధవ - మహామంత్రీ మీరు మా రాజవంశం మీద ఉన్న అభిమానంతో మాటాడుతున్నారు. సామరస్య ధోరణి సూచిస్తున్నారు. ప్రజలు కూడ యువరాజు మీది గౌరవాభిమానాలతో ఈ విధంగా విజ్ఞప్తిచేస్తున్నారు. కాని మాకిది సమ్మతంకాదు. రాజ్యాంగానికి రాజధర్మానికి ఇది సరిపడదు. "యద్యదాచరతిశ్రేష్ఠః తత్తదేవే తరో జనః" అన్న గీతావచనానుసారంగా ఉన్నత స్థానంలో ఉన్న మనము ఒక హంతకుని దండించక వదలివేస్తే తక్కిన అధికారులు దీనినే ప్రమాణంగా తీసుకొని నిష్పక్షపాతంగా దోషులను శిక్షించక వదలి వేస్తారు. అందువల్లధర్మ న్యాయ వ్యవస్థ చెడి పాపభీతిలేక ప్రజలు విచ్చలవిడిగా ఘోర కృత్యాలకు ఎగబడగలరు. కనుక నేరానికి తగిన శిక్ష విధించవలసినదే. ఇంకా 'ధర్మో రక్షతి రక్షితః' అన్నది మహాభారత సూక్తి. ధర్మాన్ని మనము కూలదోస్తే

అది మనను కాల్చుతుంది. ధర్మాన్ని కాపాడితే అది మనను కాపాడుతుంది. కనుక ఈ నీతి అందరికీ శిరోధార్యం. ఇక దోషి రాజకుమారుడు యువరాజు అన్న వివక్ష, అభిమానం ఉండి ఆయనకు క్షమాభిక్ష పెట్టవలెననడం కూడా నీతికాదు. ఎందుకంటే ఈయన రాజుకాకముందే జాగరూకత, నిగ్రహం లేని వాడై ప్రజలను చంపుతున్నాడు. రాజైన తర్వాత ఎంత దారుణంచేస్తాడో, ఇలాంటి దోషి రాజుకావడానికి అర్హుడుకాడు. అంతేకాక రాజుల కొక న్యాయం ప్రజలకు వేరొక న్యాయం ఉండదు, ఉండగూడదు. మరియు ప్రమాదవశాత్తు ఇతరులకు అపకారం చేస్తే క్షమించవచ్చు లేదా అల్పశిక్ష వేయవచ్చు కాని ఒకరి ప్రాణాలుతీసిన ప్రమాదాన్ని క్షమించవీలులేదు. ఇతనికి మరణదండన విధించవలసినదే.

పురో - ప్రభూ! దయతో చిత్తగించండి. చిరంజీవి యువరాజు ప్రాణాలు కాపాడండి.

(తెరలో నుండి 'యువరాజుకు మరణదండన విధించవద్దు. యువ రాజును కాపాడాలి యువరాజును కాపాడాలి' అన్న పౌరుల కేకలు వినిపిస్తాయి)

మాధవ - (చలించక ప్రశాంతంగా) సభాసదులారా! పౌరులారా! ధర్మాసనము నందుండి ఈ అభియోగాన్ని ధర్మాధికారులచేత న్యాయవిచారణ చేయించి సర్వవిధాల చర్చించి ధర్మదేవత సాక్షిగా ఈ దోషికి మరణదండన విధిస్తున్నాను. హంతకుడైన ఈ యువరాజు మంచన భట్టారకుని సూర్యుడు అస్తమించేలోగా ఉరితీయండి. (అని లేస్తాడు. సభాసదులు లేచి నిలబడుతారు. తెరపడుతుంది. తెరలో 'ఇది దారుణం ఇది దారుణం' అన్న కేకలు వినబడుతాయి)

# నాల్గవ రంగం

(మాధవవర్మ మహారాజుగారి అంతఃపురం. తెరలేచే సరికి మహా రాణి చంద్రావతీదేవి కూర్చుండి ఆందోళన చెందుతుండును)

చంద్రా - (తనలో) దుర్గాదేవి దయవలన చిరంజీవి మంచనకు ఏ ఆపద రాకుండుగాక! సభలో న్యాయవిచారణ జరిగి చిరంజీవి నిర్దోషియని నిరూపణ కావలెను. (అని విచార నిమగ్నయై) ఇదేమి అశుభ శకునంగా కుడి కన్ను, కుడిభుజం అదరుతున్నవి. మనస్సు పరిపరి విధాల చింతాక్రాంతం అవుతున్నది. చిరంజీవికి ఏదైనా కీడు మూడలేదు కదా! (అని కొంత చింతించి) నేడు మహారాజుగారి రాకకు ఆలస్యమౌతున్నది. సభలో ఏమి సంక్షోభం జరుగుతున్నదో ఎలాంటి వార్త వినవలసివస్తుందో పరమేశ్వరీ! నీ దయ మా భాగ్యం. (అని చింతామగ్నయై తొందరపడుతుండును.)
(అంతలో దుఃఖభారంతో వశం తప్పియున్న మహారాజును మహా మంత్రి, పురోహితుడు పట్టుకొని ప్రవేశిస్తారు. మహారాజు ఆసనం పై సోలిపోతాడు)

చంద్రా - (దిగ్గున లేచి) ప్రభూ! ఏమైనది? చిరంజీవి క్షేమమే కదా?

మాధవ - (దుఃఖిస్తుంటాడు)

చంద్రా - ఏమి చెప్పరేమండీ! చిరంజీవికి ఏమైనది? తీర్పు ఏమి చెప్పినారండి? చెప్పండి. (అని మహారాజు చేతులు పట్టుకొని అరుస్తుంది)

పురో - ఏమి చెప్పమంటావమ్మా! జరుగరాని దారుణం జరుగినది. చిరంజీవి మంచనకు ఉరిశిక్షపడినది.

చంద్రా - (చెవులు మూసుకొని) ఏమిటి నా తండ్రికి ఉరిశిక్షనా? ఉరిశిక్ష! హా అంబా! దుర్గాంబా! (అని అరచి మూర్ఛపోతుంది)
(రాజు, మంత్రి, పురోహితుడు తల్లడిల్లుతారు)

పురో - ప్రభూ! ఏమిటి ఈ అరిష్టం? మహారాణి పడిపోయినది.
(అని ఆమె ముఖంపై నీళ్ళు చిలుకరిస్తాడు)

చంద్రా - (మూర్ఛనుండి తేచి నెమ్మదిగా) ప్రభూ! చిరంజీవి నిజంగా దోషియా? అతనికి మరణశిక్ష విధించినారా? కన్నకొడుకనీ, యువ రాజనీ ఐనా కనికరించలేదా? ప్రభూ కనికరించలేదా! ఎంత ఘోరమైన నిర్ణయం తీసుకున్నారండి? ఇక మనకేమి గతి? ఏమి గతి చెప్పండి? (అని ఏడుస్తుంది)

మాధవ - దేవీ! దురదృష్టవంతుల నెవరు రక్షించగలరు? చిరంజీవి అదుపు తప్పిన గుఱ్ఱాలను కట్టిన రథాన్ని వేగంగా నడపడం వల్లనే పేద యువకుడు మరణించినాడని తెలిసింది న్యాయధర్మాల ననుసరించి ఆయనకు మరణదండన విధించవలసివచ్చినది. నేను రాజధర్మాన్ని పాటించి న్యాయాన్ని కాపాడినందుకు సంతృప్తిగా ఉన్నది. కాని కొడుకుకు ఇలాంటి ఘోరమరణశిక్షపడినందుకు తండ్రిగా దుఃఖిస్తున్నాను. వంశోద్ధారకుడై, మహారాజై ప్రజాపరిపాలన చేయ వలసిన కుమారునికి ఎలాంటి దుర్గతి పట్టినది. మనమెంత దౌర్భాగ్యులము దేవీ! ఇలాంటి కుమారుని కని ఈ దుర్దశను గాంచినాము. మనకెవ్వరు గతి? ఈ విశాల రాజ్యానికి రక్షకు లెవరు? హతవిధీ! హా దుర్గామల్లేశ్వరా! (అని విలపిస్తాడు)

చంద్రా - ప్రభూ! మీ ధర్మబుద్ధికి సకల దేవతలు సంతోషించవచ్చు. దుర్గా మల్లేశ్వరుడు మెచ్చి వరాలీయవచ్చు. కాని చిరంజీవిని బాసి నేను బ్రతుకలేనండి నేను బ్రతుకలేను. దయలేని ధర్మశాస్త్రా లెందుకు చెప్పండి. ధర్మం న్యాయం అని పుత్రుని కోల్పోతే మనకు ఇహ పరగతులెక్కడివి చెప్పండి? దయచేసి చిరంజీవి మరణ శిక్షను రద్దు చేయండి. నాకు పుత్రభిక్ష పెట్టండి ప్రభూ, పుత్రభిక్ష పెట్టండి. (అని శోకిస్తుంది)

మాధవ : (చలించిపోతాడు)

మహా : ప్రభూ! ఎందుకు దుఃఖిస్తారు! నేను సభలో మనవి చేసినట్లు ఇది మీ కుమారునికి సంబంధించినదే కాదు. ఈ రాజ్యంలోని ప్రజ లందరికీ చెందినది. చిరంజీవి మరణశిక్షతో మీకు పుత్రశోకం. ప్రజలకు భవిష్యత్తు అంధకారం. నా విన్నపం చిత్తగించండి! రాకుమారునికి ఉరిశిక్ష ఇంకా అమలు కాలేదు. దయచేసి ఉరిశిక్ష రద్దుచేయండి.

పురో : ఔను ప్రభూ! తప్పక దయదలచండి. మా అందరినీ ఉద్ధరించండి. మహారాణి మహా వ్యథను గమనించి చిరంజీవి ఉరి శిక్షను మాన్పించండి.

మాధవ : నేను రాజుగా దోషియైన ఆయనకు ఉరిశిక్ష విధించినందుకు శోకించడం లేదు. తండ్రిగా కుమారునికి పట్టిన దుర్గతికి దుఃఖిస్తు న్నాను. బ్రహ్మాదులు వచ్చి చెప్పినా రాజధర్మాన్ని త్యజించను, నిర్ణయం మార్చుకోను. మరణ శిక్షను మాన్పించలేను. నేను దురదృష్టవంతున్ని. ఆ దుర్గామల్లేశ్వరుదే గతి. (అని దుఃఖి స్తుంటాడు).

మహా : ఇక మన మేమి చేయగలము. ఆ దైవమే గతి (అని నిష్క్ర మిస్తాడు.)

చంద్రా : హా కుమారా! హా తండ్రీ! నీకే గతి పట్టినది. ఎంత దుఃఖిస్తు న్నావో నాయనా! నిన్ను బాసి నేను బ్రతుకలేను. ఇందరు ఉండి, తండ్రి మహారాజై ఉండి నిన్ను కాపాడలేకపోతున్నారు. ఇంకెవ్వరు గతి? ఎవ్వరు గతి? (అని శోకిస్తూ) ఇంకెవ్వరు గతి! దిక్కు లేని వారికి దైవమే గతి. సమస్త లోకాలోకాలకు గతియై స్థితియై పతి అయి సర్వస్వమై సంరక్షించే విశ్వమాత మహేశ్వరి కరుణా మయి దుర్గాదేవియే గతి. అంబా! నీవే గతి. (అని దుర్గాదేవిని దీనమైన పాటతో ప్రార్థిస్తుంది.)

పాట :

అమ్మా .... .... దుర్గమ్మా ....
మమ్మేలగ దయరావా। నమ్మి కొలువ కనలేవా ॥అమ్మా॥
సకల లోకములు సంరక్షించే। సర్వ మంగళా! జగదంబా!
ఒక పసిబిడ్డను కాపాడుట నీ। కోర్వలేని భారంబా ॥అమ్మా॥
శరణాగతులకు పరమ కరుణతో। వరముల నొసగే తల్లీ!
పరమేశ్వరి మా మొర వినరాదా। దరిజేర్చవె సురవల్లి! ॥అమ్మా॥
పతిత పావనా! దీన జనావన। భక్తవత్సలా! భవహరణా!
గతి నీవే ప్రోవగరావే సద్గతి నీవే శుభ చరణా ॥అమ్మా॥
విశ్వము నేలుచు విజయవాటిలో। వెలసిన ఓ మల్లేశ్వరీ!
శాశ్వతముగ మాభారము నీదే। శరణు శరణు మాహేశ్వరీ ॥అమ్మా॥
(అని పాడి దుఃఖిస్తుండును)

(భటుడు ప్రవేశిస్తాడు)

భటుడు : యువరాజుగారిని ఉరి తీయడమైనది. (అని నిష్క్రమిస్తారు)

మాధవ వర్మ, చంద్రావతీ దేవి : హా కుమారా! హా తండ్రీ! (అని హాహా కారాలు చేస్తు సొమ్మసిల్లిపోతారు)

(తెరలో ప్రజల హాహాకారాలు ప్రతిధ్వనిస్తాయి.)

పురో : హా రాకుమారా! (అని చింతిస్తు) మహారాజా! మహారాణీ! కొంత ధైర్యం వహించండి (అని ఓదార్చుతు ఉంటాడు. కొంత సేపటికి సాలోచనగా ఆకాశం వైపు చూచి) ఏమిటి ఈ కాల వైపరీత్యం? రాకుమారుని ఉరి తీసిన ఈ అపర సంధ్యాసమయంలో ఆకాశం పశ్చిమ దిశలోనేకాక అన్ని దిశలలో అరుణకాంతులు వ్యాపిస్తున్నవి. రాజవంశానికి సంభవించిన ఘోరమైన అరిష్టానికి ఆకాశం దిక్కులూ రోదసి ఆగ్రహంతో ఎఱ్ఱబారినవి కాబోలు. (అని ఆశ్చర్యంగా పరిశీలిస్తు) ఆకాశమంతా ఇవేమి అరుణకాంతులు,

ఇవి సాధారణ కాంతులు కావు. కన్నులు మిరుమిట్లు గొలుపుతున్న మెరుపులు. అతి విచిత్రంగా ఎఱ్ఱని మేఘాలు ఆవరించినవి. ప్రాణాలకు హాయిగా చల్లని గాలులు వీస్తున్నవి. అకాల వర్షమా ఏమి? చినుకులు పడుతున్నవి, ఇవి చినుకులా? బంగరు కాంతులతో మెరుస్తున్నవి. ఆహా! ఇదేమి చోద్యం? ఇవి నీటి చినుకులుకావు బంగారు కణికలు. కనకవర్షం కురుస్తున్నది. (అని రాజ దంపతులతో) మహాప్రభో! మహారాణీ! చూడండి. కనక వర్షం కురుస్తున్నది. మీ ధర్మబుద్ధికి మెచ్చి దుర్గాదేవి కనకవర్షం కురిపిస్తున్నట్లున్నది. (మహారాజు, మహారాణి లేచి కనకవర్షం చూచి ఆశ్చర్యపడుతారు).

మాధవ - ఆహా కనకవర్షం! నాకు తోచిన రీతిగా ధర్మాన్ని కాపాడినాను. దుర్గాదేవి అనుగ్రహిస్తున్నది.

చంద్రా - నా బంగారు తండ్రి దూరమైనాడు. ఈ బంగారు వర్షం దేనికి? (అని చింతిస్తు ఉంటుంది)

భటుడు - (ప్రవేశించి) జయము జయము మహారాజుగారికి. యువరాజుగారు పునర్జీవితుడైనారు. (అని నిష్క్రమిస్తాడు.)

చంద్రా - నా తండ్రి పునర్జీవితుడైనాడా? విశ్వమాత దుర్గాదేవికి దయ వచ్చినది. ధన్యులము మాతా ధన్యులము.

మాధవ . చిరంజీవి పునర్జీవితుడైనాడన్న వార్త మనకు పునర్జన్మ ప్రసాదించినది. మనము దుర్గాదేవి కరుణకు పాత్రులమైనాము. (అని ఆలోచనామగ్నుడై) ఇంతకు ఆ పేద యువకుడు దుర్మరణం పాలై యుండగా మన కుమారుడు మాత్రం పునర్జీవితుడైనాడు. ఇది అన్యాయమని నా హృదయం తల్లడిల్లుతున్నది. ఆ పరమేశ్వరియే అనుగ్రహించవలెను.

భటుడు - [ప్రవేశించి] జయము జయము మహారాజా! మరణించిన పేద యువకుడు పునర్జీవితుడైనాడు. [అని నిష్క్రమిస్తాడు]

పురో - మహారాజా! అపూర్వమైన అనన్యమైన మీ ధర్మబుద్ధికి మెచ్చి దుర్గాదేవి కనకవర్షం కురిపించినది. రాజకుమారుని పేదయువకుని మరల బ్రతికించినది. ఆ జగన్మాత కురిపించిన కనకవర్షం అమృతవర్షమై ఇద్దరూ పునర్జీవితులైనారు. మీ వంశం పావనమైనది. మీరు చరితార్థులు. ఈ విజయవాటిక, ఈ రాజ్యం పునీతమైనవి. మేమంతా ధన్యులము.

మంచన - [ప్రవేశించి] మాతృదేవికి, పితృదేవులకు అభివందనాలు. గురుదేవులకు నమస్కారాలు. [అని వారికి పాదవందనం చేస్తాడు]

చంద్రా: (కొడుకును ముద్దాడుతు) నాయనా షేమంగా ఉన్నావా! దుర్గాదేవి మన నన్నుగ్రహించినది.

మంచన: అమ్మా! నేను షేమమే. నా శిక్ష వార్త విని మీరెంత తల్లడిల్లితిరో, మీ దుఃఖానికి నేను కారకుడనైనందుకు చింతిస్తున్నాను.

మాధవ; నాయనా! చిరంజీవీ: అంబ దయవల్ల అందరమూ గట్టెక్కినాము. ఇకనైనా జాగరూకతతో ఆత్మ నిగ్రహంతో జీవితం సాగించి ధర్మబద్ధంగా రాజ్యపరిపాలన చేసి యశస్వివి కావలెను.

పురో: చిరంజీవి యువరాజుకు శుభాశీస్సులు. "సత్యమేవ జయతే" అని "ధర్మో రక్షతి రక్షితః" అని, "గతిస్త్వం గతిస్త్వం త్వమేకా భవాని" అని అన్న మహావాక్యాలు అనుభవసిద్ధంగా నిజమైనవి. ధర్మబుద్ధికి మెచ్చి కనకవర్షం కురిపించిన దుర్గాదేవి నేటి నుండి కనక దుర్గాదేవి. సర్వే జనాస్సుఖినో భవంతు! (తెరలో కనక దుర్గాదేవికి జయ, మాధవవర్మ మహారాజుకు జయ, యువరాజు మంచన భట్టారకునికి జయ అని జయ నినాదాలు వినిపిస్తాయి తెరపడును.)

శుభమ్